Lakhte Jigar (Telugu)

# ప్రియమైన మీకు!

## యువతకు ఓ మేధావి హితబోధ

మూలం:

**షేఖ్ అలీ తన్‌తావి**

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# పుస్తక పరిచయం

ఈ పుస్తకం ప్రియమైన మీకు! (లఖ్తె జిగర్) అరబీ భాషకు చెందిన చిరు పుస్తకం "యా బిన్తీ వయబ్ని" ఉర్దూ అనువాదం. ఈ పుస్తకాన్ని అరబ్ దేశానికి చెందిన సుప్రసిద్ధ ఆలిం, రచయిత అయిన హజ్రత్ షేఖ్ అలీ తన్‌తావి రచించారు. ఇందులో రెండు భాగాలు ఉన్నాయి.

మొదటి భాగం 'ప్రియమైన నా ముద్దుల కూతురుకు....!'వ్యాస రూపకంగా రచించబడింది. ఇందులో రచయిత ఆడపిల్లలు మంచీచెడుల విచక్షణను అలవరచుకునేలా దారి చూపారు. బోధనా శైలి ప్రభావవంతం గానూ, స్నేహపూర్వకంగానూ ఉంది. రచయిత జాతి యువతులందరినీ ఉద్దేశించి ఈ వ్యాసాన్ని వ్రాసినప్ప టికీ, ఒక తండ్రి తన కుమార్తెకు హితబోధ గరుపుతున్నట్లుగా ఈ భాగం కనిపిస్తుంది.

రెండవ భాగం ఒక లేఖ, రచయితకు ఒక యువకుడు తన సమస్యను తెలుపుతూ, దానికి పరిష్కారం చూపవలసినదిగా వ్రాసిన లేఖకు సమాధానంగా రచయిత అతనికి ఇచ్చిన సలహాలను ఇందులో పొందుపరచడం జరిగింది.

ఈ చిరుపుస్తకంలో యువతీయువకులను జాగృత పరిచే అనేక విషయాలు ప్రస్తావించబడ్డాయి. అందుగ్గాను నేటి యువతరం రచయితకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

ఈ చిరుపుస్తకంలోని మొదటి భాగం 'ప్రియమైన నా ముద్దుల కూతురుకు....!'46 ఎడిషన్లు ఇప్పటి వరకు వెలువడ్డాయి. దీనిని బట్టి

ఈ చిరు పుస్తకం ఎంతగా ప్రాచుర్యం పొందిందో, ప్రజలపై ఎంతగా ప్రభావం చూపిందో ఊహించవచ్చు.

రచయిత మనోభావాలను ఉర్దూ వక్తల వరకు చేర్చడంలో నేను ఎంత వరకు సఫలమయ్యానేది స్వయంగా పాఠకులే నిర్ణయిస్తారు.

ఈ పుస్తకం ద్వారా యువతరం తమ వ్యక్తిత్వ వికాసానికి అవసరమైన విచక్షణా జ్ఞానం పొందాలని దుఆ చేస్తున్నాను.

**అబ్దుల్ హాఖ్ ఫలాహి,**
ఢిల్లీ – హి.శ.11/సఫర్/1409,
క్రి.శ.24/సెప్టెంబర్/1988

# రచయిత పరిచయం

హజ్రత్ షేఖ్ అలీ తన్‌తావి గారు ఆధునిక అరబ్బు రచయితల్లో ఉత్తమ శ్రేణికి చెందిన రచయిత. వీరిని ఇస్లామీయ పండితులలో గొప్ప పండితుడిగా కూడా పేర్కొంటారు.

వీరి గొప్పతనం ఏమిటంటే, అరబ్బుకు చెందిన అతికొద్ది ప్రముఖ పండితులలో వీరూ ఒకరుగా లెక్కించబడతారు. నవతరం మనోమస్తిష్కాలలో ఇస్లామీయ విధానాలను, ఇస్లామీయ సూత్రాలను జొప్పించి వారి మనో వికాసానికి అవసరమైన ధార్మిక విద్యను గరపటమే గాక ధర్మం నుండి మరలిపోయి, అయోమయంలో పడి సతమతమవుతున్న, అధార్మికతను వ్యాపింపచేసిన యువతరం కోరికలను అంతమొందించే ప్రయత్నం చేసిన ప్రముఖుల్లో ఒకరు షేఖ్ అలీ తన్‌తావీ. సమాజం మొదలును బలహీనపర్చే పాశ్చాత్యుల నుండి అలవర్చుకున్న, స్త్రీ పురుషుల కలివిడితనంలాంటి తప్పుడు జీవన విధానాలను ఏకరువుపెట్టే సాహిత్యాన్ని వీరు గర్హించారు.

హజ్రత్ షేఖ్ అలీ తన్‌తావీ రచనలు అత్యంత ప్రభావవంతంగా, హృదయరంజకంగా, మనో ఉల్లాసాన్ని కలిగించేవిగా ఉండి, వాటిని చదువు తున్నప్పుడు విసుగు కలగకుండా, చదివిన కొద్దీ మళ్లీ మళ్లీ చదవాలనిపించే విగా ఉంటాయి. పదాల అల్లిక, వాక్యాల పొందిక, సూటిగా మరియు సరైన ఉదాహరణలతో పాటు నిజాయితీ, మృదువైన మరియు స్నేహపూర్వక మైన రచనా శైలి వీరి రచనలకు జీవం ఇస్తాయి.

రచయిత కేవలం రచనలకు రారాజే కాకుండా వక్తృత్వంలో కూడా మహోన్నత స్థానాన్ని కలిగి ఉన్నారు. వీరి ప్రసంగాలలో కొన్నింటిని గ్రంథస్తం చేసి ప్రచురించటమూ జరిగింది. వీరి ప్రసంగాలు అత్యంత ప్రభావవంతం గానూ, దిశానిర్దేశకంగానూ ఉంటాయి.

రచయిత ఉపయోగించిన కొన్ని పదాలకు వివరణ పుస్తకం చివరలో ఇవ్వబడింది. దీనివలన రచయిత మనోభావాలను పాఠకులు సులువుగా అర్థం చేసుకోగలరని భావిస్తున్నాను.

**– అబ్దుల్ హఖ్ ఫలాహి**

ఢిల్లీ – హి.శ.11/సఫర్/1409,

క్రి.శ.24/సెప్టెంబర్/1988

# రచయిత పలుకులు

అల్‌హమ్దులిల్లాహ్ వస్సలాతు వస్సలాము అలా రసూలిల్లాహ్!

గత అరవై సంవత్సరాలుగా నేను ప్రసంగాలు మరియు రచనలతో సంబంధం కలిగి ఉన్నాను. వాటన్నింటిలోనూ నా ఈ రెండు రచనలు అనూహ్యమైన రీతిలో జనాదరణకు నోచుకున్నాయి. ప్రత్యేకంగా 'ప్రియమైన నా ముద్దుల కూతురుకు....!' దక్కినంత ప్రసిద్ధత నా ఏ ఇతర రచనకూ దక్కలేదు. ఈ వ్యాసం రచించేటప్పుడు నా వయస్సు యాభై సంవత్సరాలు. ఇప్పుడు నేను ఎనభయ్యో వడిలో ఉన్నాను. అల్లాహ్ నాకు ఆరోగ్యాన్ని, మంచి ప్రతిఫలాన్నీ ప్రసాదించి, ఈ పుస్తక పాఠకులకు మంచిని గ్రహించే సద్బుద్ధిని ప్రసాదించాలని దుఆ చేస్తున్నాను. ఆమీన్!

నేను రచించిన 'ప్రియమైన నా ముద్దుల కూతురుకు....!' 46 ఎడిషన్లు వెలువడ్డాయి. నాకు తెలియకుండా ఇతరులు కూడా దీన్ని ప్రచురించి ఉండవచ్చు. దీనిని ఉచితంగా లేదా అతి తక్కువ ధరకు అమ్మాలనే నిబంధనతో దీని ముద్రణకు నేను అందరికీ అనుమతినిచ్చాను.

ముస్లిములమైన మనం ప్రస్తుతం రెండు వైపుల నుండి దాడులకు గురవుతున్నాము. మొదటిది. మన విశ్వాసాలను ప్రక్కదోవ పట్టించే కారకాల ద్వారా దాడులు చేయడం, రెండవది, మనోవాంఛలను అనగా లైంగిక కోరిక లను తీర్చుకునే అపమార్గాలను తెరవడం ద్వారా దాడులు చేయబడు తున్నాయి. మొదటి రకం దాడులు తమదైన రీతిలో చాలా ప్రమాదకర మైనవి. ఇందులో మనిషి నెమ్మది నెమ్మదిగా చిక్కుకుంటాడు. దీనికి ఎవరినైనా గురి చేయాలనుకున్నప్పుడు అతను అందులో తప్పకుండా చిక్కుకుని తీరుతాడని కచ్చితంగా చెప్పలేము. కాని రెండవ రకం దాడుల్లో, యువకులను

లైంగిక కోరికలు తీర్చుకోవటానికి ఆహ్వానించిన వెనువెంటనే వారు అక్కడికి చేరుకుంటారు. ఎందుకంటే ఇది చాలా తొందరగా ప్రభావం చూపే అంటు రోగం లాంటది. ఇది మనిషిని నీరసింపజేస్తుంది. కాని అంతమెందించదు, బాధపెడుతుంది కాని మృత్యువు దరిచేరనీయదు.

మొదటిది (అనుమానాలు), ఒకవేళ అవిశ్వాసం వైపునకు తీసుకుపోతే, రెండవది (లైంగిక విశృంఖలత్వం), అశ్లీలత మరియు పాపాల వైపునకు తీసుకుపోతుంది.

ఈ పుస్తకం వ్రాసిన తర్వాత కూడా నేను చాలా ఉపన్యాసాలు ఇచ్చాను. ప్రత్యక్ష ప్రసంగాలు చేశాను. లెక్కలేనన్ని చర్చల్లోనూ పాల్గొన్నాను. అల్లాహ్ దయ వల్ల వీటన్నింటిలో కంటే ప్రస్తుత రచన చూపిన ప్రభావం కారణంగా యువతీ యువకుల మనోమస్తిష్కాలలో నేను ఇప్పటికీ ఉన్నాను.

దీనిని పాఠకులకు సుబోధకంగా చేయాలని, దీని ప్రతిఫలం నాకు, నా కుమారుడికీ, దీన్ని ప్రచురించబోతున్న నా అల్లుడు ముహమ్మద్ హతాహత్‌కు లభించాలని అల్లాహ్‌ను వేడుకుంటున్నాను.

ఈ పుస్తకాన్ని లిఖించి ఎన్నో సంవత్సరాలు గడిచిపోయినా ఇందులో నేను ఒక్క అక్షరం కూడా హెచ్చుతగ్గులు చేయలేదు. బహుశా అది ఇప్పుడు సాధ్యం కూడా కాదేమో! ఎందుకంటే ఈ పుస్తక పాఠకులు తూర్పు నుండి పడమర వరకు విస్తరించి వున్నారు. సిరియా, ఉర్దున్, ఈజిప్ట్ మరియు ఈరాక్‌లలో దాని ఎడిషన్‌లు వెలువడ్డాయి. నాకు తెలిసినంత వరకు ఇది ప్రసిద్ధ భాషలైన ఆంగ్లం మరియు ఉర్దూ భాషల్లోనూ అనువదించబడింది. ఈ పుస్తకంలోని అంశాలు పాఠకుల హృదయాల్లో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. అలాంటప్పుడు ఇందులో నేను మార్పులు చేర్పులు ఎలా చేయగలను?

అఖూలు ఖౌలీ హాజా వ అస్తగ్ ఫిరుల్లాహల్ అజీమ్

– అలీ తన్‌తావీ, మక్కా ముకర్రమా,

హి.శ. 12/రబీవుల్ అవ్వల్/1406

# ప్రియమైన నా ముద్దుల కూతురుకు...!

## ప్రియ కుమారి!

జీవితంలోని యాభై[1] వసంతాలను నేను పూర్తిచేసుకున్నాను. నాకు యవ్వనం దాటి పోయింది. దానితో పాటు యవ్వనపు కోరికలకూ, తియ్యని కలలకూ వీడ్కోలు చెప్పేశాను. ఇప్పటి దాకా గడిచిన నా జీవిత కాలంలో నేను దేశ విదేశాలు తిరిగి, రకరకాల మనుషులను కలిసి ప్రపంచ పరిస్థితు లన్నింటినీ అధ్యయనం చేశాను. ప్రియ కుమారీ! నా వయస్సు, నా అనుభవాల నుండి నేను గ్రహించిన కొన్ని విషయాలు చెప్తాను విను! వీటిని బహుశా నువ్వు ఎన్నడూ ఎవరి నుండీ విని ఉండవు.

నైతిక విలువలను కాపాడుకోమని, లైంగిక కోరికలను అదుపులో ఉంచుకోండి అని, చెడుగులను అంతమొందించండి అని మేము దీనికంటే ముందు కూడా వ్యాసాలు వ్రాస్తూనే, వేదికలపై ప్రసంగిస్తూనే వచ్చాము. వీటిని గురించి వ్రాసి వ్రాసి మా కలాలు అలసిపోయాయి. దీని వైపునకు పిలిచి పిలిచి మా గొంతుకలు పూడుకుపోయాయి. అయినా గాని ఈ మాటలు మన జాతి యువతీ యువకుల చెవుల కెక్కలేదు. మా పిలుపులు అరణ్య రోదనలని రుజువైపోయాయి. పైగా దీన్ని అనుసరించడానికి బదులుగా తిరస్కరించే వారి సంఖ్య రోజురోజుకూ పెరగసాగింది. అశ్లీలత, పరదా

1. ఇది నేను వ్యాసం వ్రాసేటప్పటి విషయం. కాని ఇప్పుడు నేను ఎనభయ్యో పడిలో ఉన్నాను.

రాహిత్యం సర్వసామాన్యమై పోయాయి. నగ్నత్వం నవ యవ్వనపు రెక్కలు తొడిగింది. ఇవి ఏ ఒక్క ప్రత్యేక దేశంలోనో లేదా సంఘంలోనో ఉన్న పరిస్థితులు కావు. ఇవి ముస్లిం దేశాల్లో కూడా విస్తరించి అక్కడి ప్రజలూ పరదా రాహిత్యాన్ని అవలంబిస్తున్నారు. ఎక్కడైతే పరదాకు మహోన్నత స్థానం, దాని కొరకు ప్రత్యేక ఏర్పాట్లు చేయబడి వుండేవో, ఎక్కడైతే మాన మర్యాదలు సురక్షితంగా ఉంచబడేవో అలాంటి దేశమైన సిరియా దేశం కూడా చివరకు ఈ చెడుగులలో చిక్కుకుపోయింది. ఇప్పుడు ఈ దేశ మహిళలు పరదా లేకుండా, అర్ధ నగ్నంగా తిరుగుతున్నారు.

ఎంతగా ప్రయత్నించినా మేము ఈ చెడుగును అంతమొందించడంలో సఫలీకృతం కాలేకపోయాము. ఇకపై కూడా దీనిపై విజయం సాధిస్తామనే ఆశ కనబడటం లేదు. ఇలా ఎందుకు జరిగిందో నీకు తెలుసా? ఎందుకంటే సమాజాన్ని సంస్కరించడానికి మనం పూనుకోలేదు. మంచితనం అంటే ఏమిటో కూడా మీకు తెలియజెప్పలేదు.

ప్రియ కుమారీ! మంచితనపు తలుపు నీ ముందే తెరచుకొని ఉంది. దీని తాళం చెవులు కూడా నీ చేతుల్లోనే ఉన్నాయి. ఎప్పుడైతే నువ్వు ఈ సత్యాన్ని గ్రహించి, దీన్ని స్వీకరిస్తావో అప్పుడు నిజంగా నువ్వు మంచి వైపునకు పరుగిడి తనకు తానుగా చెడుగు నీ నుండి దూరమై, పరిస్థితులు వాటంతట అవే చక్కబడతాయి.

పాపకార్యం చేయడంలో పురుషుడే ముందడుగు వేస్తాడనేది సత్యం. స్త్రీ ఎన్నడూ ముందడుగు వేయదు. కాని నువ్వు ఒప్పుకోనిదే అతను తన ఉద్దేశ్యంలో సఫలీకృతుడు కాలేడు అనేది కూడా సత్యమే. నీ హృదయం మెత్తబడి, అతనిపై నువ్వు జాలి చూపించక పోయినట్లయితే ఈ ఘోర అపరాధం ఎన్నటికీ జరగదు. నువ్వు దొంగను లోనికి ఆహ్వానించి నీ కళ్లూ, హృదయమూ పాన్పుగా పరిచి, చివరకు అతడు తన పని ముగించుకున్న

తర్వాత నువ్వు కంగారు పడి రక్షించండి! రక్షించండి! నేను మోసపొయ్యాను అని అరుస్తావు!!

పురుషులందరూ తోడేళ్లు వంటివారు, నువ్వు మేకపోతు లాంటి దానివి అని నీకు తెలిసి ఉంటే, నువ్వూ మేక వలెనే తోడేలును చూడగానే దూరంగా పరుగు లంకించుకునే దానివే. వాళ్లు దొంగలని నీవు గ్రహించి ఉంటే పిసినారి తన సొమ్మును దొంగల బారిన పడకుండా ఎలా రక్షించుకుంటాడో, నువ్వూ అలాగే జాగ్రత్త పడేదానివి.

తోడేలు దృష్టి ఎల్లప్పుడూ మేక మాంసంపైనే ఉంటుంది. అలాగే పురుషుడు దృష్టి కూడా స్త్రీ పైనే ఉంటుంది. స్త్రీ కొరకు శీలం ఎంతో విలువైనది, గౌరవనీయమైనది. దీన్ని పోగొట్టుకోవడం మృత్యువు కంటే ఘోరమైనది. ఇది నువ్వు అతి జాగ్రత్తగా దాచుకునే వస్తువు. దీనితోనే నీకు గౌరవం, ఇంకా చెప్పాలంటే, దీని కోసమే నువ్వు పుట్టించబడ్డావు. ఏ అమ్మాయి శీలాన్నైతే పురుషుడు దోచుకుంటాడో ఆమె జీవితం తోడేలు వేటాడి పీక్కుతిన్న మేక కంటే వెయ్యి రెట్లు దుర్భరంగా ఉంటుంది. ఏ యువకుడైనా ఏ అమ్మాయి వైపు అయినా దృష్టిసారిస్తే అతను ముందుగా తన ఊహల్లో అందచందాలను అనుభవిస్తాడు.

పురుషులు పలికే తేనెలొలికే ఈ మాటలకు నువ్వు ఎన్నటికీ లొంగకు: "మేము నీ ప్రవర్తన, మంచితనం వల్ల నీకు దగ్గరగా ఉన్నాము. నీతో మాకు ఎలాంటి అవసరమూ లేదు. నీతో మేము స్నేహపూర్వకంగానే మాట్లాడు తున్నాము, స్నేహితుల్లానే మిమ్మల్ని ఇష్టపడుతున్నాము". ఇలాంటి మాటలు ముమ్మాటికీ అబద్ధాలని నేను ప్రమాణం చేసి చెబుతున్నాను. ఒకవేళ ఎప్పుడైనా నువ్వు ఒంటరిగా ఉన్నప్పుడు యువకులు మాట్లాడుకునే మాటలు వింటే ఆశ్చర్యానికి గురవుతావు. నీలో వారంటే ఒక రకమైన భయం పుట్టుకొస్తుంది.

ఎవరైనా యువకుడు నిన్ను చూసి చిరునవ్వులు చిందిస్తూ దగ్గరగా వచ్చి నవ్వుతూ మాట్లాడి, చిన్నా చితకా పనుల్లో నీకు సహాయ సహకారాలు

అందిస్తే నిజానికి దాని వెనుక దాగి ఉన్న నీచమైన కోరికకు పునాది పడినట్లే. లేదా కనీసం అతను తనకు తానుగా దానికి పునాదులు పడినట్లేనని భావించుకుంటాడు.

తర్వాత ఏం జరుగుతుంది? ప్రియ కుమారీ! తర్వాత ఏమవుతుంది? చెప్పు, ఆలోచించు, మీరిద్దరూ కొన్ని నిమిషాల ఆనందాన్ని ఆస్వాదించడానికి పాపకార్యంలో మునిగిపోతారు. తన కోరిక తీర్చుకున్న తర్వాత అతను తాను చేసిన నిర్వాకాన్ని శాశ్వతంగా మరచిపోతాడు. కాని నువ్వు మాత్రం మరవ లేవు. బాధతో కూడిన కోపపు కుంపటిలో జీవితాన్ని సాగిస్తావు. నిన్ను గర్భవతిని చేసి, ఆ భారాన్ని నీపై మోపి అతను మెల్లగా జారుకుంటాడు. ఆ సమయంలో నువ్వు నలిగిపోతావు. నీ మనసు దు:ఖ సాగరంలో మునిగి పోతుంది. ఈ కళంకం నీ నెత్తిపైనే రుద్దబడుతుంది. ఆ దుష్టుడుని సమాజం, "యవ్వనంలో ఉన్నవాడు, కాలు జారాడు, అతను తౌబా చేసుకుని పశ్చాత్తాపం చెందాడు" అని క్షమించి వేస్తుంది. తర్వాత అతను వేరే అమాయకురాలిని వేటాడి ఆమె శీలాన్ని కూడా దోచుకుంటాడు.

మరి నువ్వు? నువ్వు మాత్రం జీవితాంతం అవమానానికి గురవుతావు. నిన్ను సమాజం ఎన్నటికీ క్షమించదు.

నువ్వు తొలి పరిచయంలోనే అతన్ని చూసి దృష్టి మరల్చుకుని ఉంటే, దృఢ సంకల్పంతో అతడి పట్ల అశ్రద్ధవహించి, జాలి చూపకపోయివుంటే ఎంత బాగుండేది! ఆ సమయంలో నువ్వు నీ కాలి చెప్పుతీసి కొట్టి ఉంటే పరిస్థితి నీచకార్యం వరకూ చేరకపోయేది. ఆ సమయంలో దారిన పోయే వారందరూ నిన్ను మెచ్చుకుని అతన్ని చితక బాదేవారు. దీని తర్వాత ఏ దుష్టుడూ గాజులు ధరించిన అమ్మాయి చెయ్యిపట్టుకోవడానికీ సాహసించలేక పోయేవాడు. అతడిలో రవ్వంత మంచితనం ఉన్నా పశ్చాత్తాపం చెంది, నీలోని మంచితనాన్ని గుర్తించి, ధర్మసమ్మతమైన మార్గంలో బంధాన్ని నెలకొల్పు కోవడానికి నీ వద్దకు వివాహ దరఖాస్తు తీసుకుని వచ్చేవాడు.

స్త్రీ ఎంతగా అభివృద్ధి సాధించినా, గౌరవం, ఆస్తి, ఐశ్వర్యాలను స్వంతం చేసుకున్నా, ఆమె చివరికి వివాహ బంధంలోనే సౌఖ్యాన్ని పొందు తుందనేది జగమెరిగిన సత్యం. స్త్రీ ఒక ఇంటికి యజమానురాలై, భర్తకు విధేయురాలైన భార్యగా, పిల్లలకు ఉత్తమమైన మాతృమూర్తిగా హోదాలు పొందటంలోనే ఆమె జీవిత సాఫల్యం దాగి ఉందని తెలుస్తుంది. మహారాణి అయినా లేక రాజకుమారీ అయినా లేక ధనవంతుడి కుమార్తె అయినా లేక ప్రపంచ ప్రఖ్యాత హాలివుడ్ హీరోయిన్ అయినా లేక పార్లమెంట్ మెంబర్ అయినా లేక క్రీడాకారిణి అయినా సరే వాస్తవంగా స్త్రీలందరిలోనూ ఈ తలంపు ఒకే విధంగా ఉంటుంది.

ఈజిప్టు మరియు సిరియాకు చెందిన ఇద్దరు ప్రముఖ మహిళల గురించి నాకు బాగా తెలుసు. గౌరవం, సంపద, డబ్బూ, ఐశ్వర్యం అన్నీ వారి పాదాల చెంత నిలిచి ఉన్నాయి. కాని వారిద్దరూ తమ దాంపత్య జీవితాన్ని కోల్పోయి మతిభ్రమించి పిచ్చివారైపోయారు. వీరిద్దరూ గొప్ప పేరు ప్రఖ్యాతులను సంపాదించినవారే! వారి పేర్లు మాత్రం నన్ను అడగవద్దు!

తర్వాత వివాహం చేసుకుంటానని మాటిచ్చిన పురుషుడు సౌశీల్యవతి అయిన స్త్రీని చెడు మార్గంలో పడవేస్తాడు. చివరకు శీలం పోయిన లేదా చెడునడత కలిగిన స్త్రీతో ఏ పురుషుడూ వివాహ మాడటానికి ఇష్టపడడు. అతడు ఎంత దుష్టుడైనా సరే! ఆ అమ్మాయి అతని అబద్ధపు మాటల వలలో చిక్కుకుని చెడుమార్గంలో పయనిస్తే, అతడు తన పని ముగించుకుని ఆమెను వదిలి ముందుకు సాగిపోతాడు. ఎందుకంటే, అతను శీలం పోగొట్టుకున్న అమ్మాయిని తన ఇంటి యజమానురాలుగా, తన పిల్లలకు తల్లిగా చేయడానికి ఇష్టపడడుగనుక.

పురుషుడు ఎంత నీచుడైనా, చెడు నడత గలవాడైనా బజారులో తన సర్వస్వాన్ని అతనికి అప్పగించడానికి, అతడి చేతిలో కీలుబొమ్మగా మారడానికి సుముఖత చూపి అమాయకంతో నిండిన అందమైన అమ్మాయిని వెతకటంలోనూ, కుక్కల మరియు పిల్లుల షరీఅత్ మరియు షైతాను విధానా

లను అనుసరించి వివాహం చేసుకోవటంలో సఫలీకృతుడు కాకపోతే అతను ఖచ్చితంగా ఇస్లామీయ ఆదేశాలకనుగుణంగా తన జీవిత భాగస్వామిని వెతుక్కుంటాడు.

ప్రియ కుమారీ! పెళ్లి మండపాల్లో వివాహాలు మీ వల్లే తక్కువయ్యాయి. ఒకవేళ మీలో శీలం పోగొట్టుకున్న అమ్మాయిలు ఉండకపోయి వుంటే ఈ పెండ్లి మండపాలు వెలవెలబోవటాన్ని చూసేవాళ్లమే కాదు, చెడు కార్యాలకు అదును దొరికి ఉండేదీ కాదు. పరిస్థితులు ఇంత దారుణంగా ఉన్నా మౌనంగా ఎందుకు కూర్చుని ఉన్నావు?

ఇలాంటి చెడుగులకు మంచి నడవడిక కల్గిన సౌశీల్యవతులైన, ధర్మపరాయణురాళ్లు అయిన మనసులో కల్మషంలేని, మోసం అంటే ఎరుగని అమాయక అమ్మాయిలే బలవుతున్నారన్నది వాస్తవం. సౌశీల్యవతులైన మహిళలపై కమ్ముకుని వున్న ఈ గ్రహణాలను తొలగించడానికి నడుం బిగించండి! వాస్తవం ఏమిటంటే ఈ పని కొరకు మీరే సరైన వారు. ఎందుకంటే మహిళల శారీరక స్థితి, వారి మనస్తత్వాన్ని ఎక్కువగా తెలిసినవారు మీరే. ఈ మాటలను మీరు వారికి అందరికంటే అనగా పురుషులకంటే మిన్నగా అర్థమయ్యేలా తెలుపగలుగుతారు. అందువల్ల మీరు ఈ పనిని నిర్వర్తించాల్సి ఉంది.

ప్రస్తుతం సిరియా దేశ పరిస్థితి ఎలా ఉందంటే ఇక్కడ ప్రతీ ఇంట్లోనూ అమ్మాయిలు వివాహాల కొరకు వేచి చూస్తూ కూర్చొని ఉన్నారు. వారికి సరైన సంబంధాలు దొరకటంలేదు. ఎందుకంటే అక్కడి యువకులు ఏ సుఖమైతే ధర్మసమ్మతమైన భార్యల్లో పొందాలో, దాన్ని వారు వారి గర్ల్ ఫ్రెండ్స్‌లతో పొందుతున్నారు. నేను కేవలం సిరియా పరిస్థితి మాత్రమే తెల్పుతున్నాను. ఇతర అరబ్బు దేశాల్లో కూడా ఇలాంటి పరిస్థితులు నెలకొని ఉండవచ్చు.

ఇలాంటి భయంకర పరిస్థితులకు ఎదురొడ్డాలంటే విజ్ఞానవంతులైన మహిళలు స్కూళ్లల్లో, యూనివర్శిటీలలో చదివే విద్యార్థులను సంఘటిత

పరచి చెడు మార్గం పట్టిన మీ సోదరీమణులను రుజుమార్గం వైపునకు ఆహ్వానించండి. వారి హృదయాలలో దైవభీతి జనించేలా చేయండి. అప్పటికీ వారు తమ వైఖరిని విడనాడకపోతే వారికి ఇలా సూటిగా, విడమర్చి నచ్చ జెప్పండి : "ఇప్పుడు మీరు యవ్వనంలో ఉండటం వల్ల యువకులు మీ పట్ల ఆకర్షితులవుతున్నారు. వేళాపాళా లేకుండా మీ చుట్టూ తిరుగుతున్నారు. కొద్దిగా ఆలోచించండి, యవ్వనపు ఈ కాంతి, తేజస్సు, సౌందర్యం, ఆకర్షణ కలకాలం ఉంటాయా? ఈ ప్రపంచంలో ఏ వస్తువునైనా శాశ్వతంగా, బలంగా ఉండేది ఉందా? కొద్దిగా ఆలోచించండి, మీరు ముసలివారై, వెన్నుముక వంగిపోయి ముఖంపై నునుపుతనం తగ్గిపోయి, శరీరం ముడుతలు పడి ఉన్నప్పుడు ఎవరైనా మీ వైపు కన్నెత్తి చూసారా? ఎవరైనా మీ మంచిని కాంక్షించే వారుంటారా?

ముసలి వారిని ఎవరు ఆదరిస్తారో మీకు తెలుసా? వారి కుమారులు, కుమార్తెలు, మనవళ్లు, మనవరాళ్లు వారిని ఆదరిస్తారు. ఆ వయస్సులో కుమారులు, కుమార్తెలు; మనవళ్లు, మనవరాళ్లను కలిగి ఉన్న మహిళ తన ఇంటికీ, కుటుంబానికీ యజమాని, మహారాణి అవుతుంది. అప్పుడు ఆమె తనకు కలిగిన సౌభాగ్యాన్ని చూసుకుని సంతృప్తి చెందుతుంది. కాని చెడునడత గల స్త్రీ ఆ వయస్సులో ఎలాంటి దుర్భర జీవితాన్ని గడుపుతుందో మీరే స్వయంగా ఊహించవచ్చు.[2]

---

2. నేను బ్రోకల్స్‌కు చెందిన ఒక రోడ్డు మీద ఒక వృద్ధ మహిళను చూశాను. ఆమెకు రోడ్డు మీద ఏ విధమైన అడ్డంకులూ లేవు. కాని ఆమె కాళ్లు భూమిపై సరిగ్గా పడట్లేదు. ముసలితనం వల్ల ఆమె అవయవాలు వణుకుతున్నాయి. రోడ్డు క్రాస్ చేయడానికి ఆమె నిలబడి ఉంది. కార్లు ఆమెకు అతి సమీపం నుండి వెళ్లిపోతున్నాయి. అవి ఆమెను నుగ్గునుగ్గు చేసేస్తాయోమే అని నాకు అన్పించింది. ఆమెకు ఎవరూ లిఫ్ట్ కూడా ఇవ్వట్లేదు. ఎవ్వరూ ఆమెను రోడ్ క్రాస్ చేయించడానికి ముందుకు రాలేదు. ఇది చూసి నా మనసు కరిగిపోయింది. నేను మాతో పాటు ఉన్న ఒక యువకుడిని వెళ్లి ఆమెను సహాయపడమని పంపించాను. నాతో పాటు నా స్నేహితులు నదీమ్ జబ్‌యాన్ కూడా ఉన్నారు.

ఇలాంటి మాటలకు ఎలాంటి రుజువూ చూపవలసిన అవసరం లేదు. మార్గం తప్పిన సోదరీమణులను రుజుమార్గం వైపునకు ఆహ్వానించడంలో ఆలస్యం చేయకండి. ఈ ఉపాయం వల్ల కూడా వారు తమ వైఖరిని మార్చుకోక పోతే కనీసం ఇంకా "ప్రేమ" అనే మనోవ్యాధికి గురికాకుండా ఉన్న పురుషుల మాయాజాలానికి తలొగ్గని అమాయక కన్యలను, మార్గం తప్పిన వారిలో చేరకుండా కాపాడండి.

## ప్రియ కుమారీ!

నేను నీకు ఒకేసారి నిష్ఠాపరురాండ్లు అయ్యేటట్లుగా ముస్లిం మహిళ లలో మార్పును తీసుకురమ్మని అనట్లేదు. ఏ మహోన్నత కార్యమైనా ఉన్న పళంగా జరగదని నాకూ తెలుసు.[3] అందువలన ఈ విషయంలో కంగారు, తొందరపాటు పడవలసిన అవసరం లేదు. నీకు ఇప్పుడున్న వస్త్రధారణను

---

ఆయన బ్రోకల్ నగరంలోనే 40 సంవత్సరాల కంటే ఎక్కువ కాలం నుండి నివసిస్తున్నారు. ఆయన నాతో ఇలా అన్నారు :

"మీకు తెలుసా? ఈ ముసలమ్మ యవ్వనంలో ఉన్నప్పుడు ఈ నగరంలోనే అత్యంత సౌందర్యవతి. ప్రజల కొరకు ఒక పరీక్ష అయి వుంది. ప్రజల పరిస్థితి ఎలా ఉండేదంటే ఆమెపై తమ ప్రాణాలు, సంపదలను బలిచేసేవారు. ఒక్కసారి ఆమె తన చూపులను వారిపై నిలిపితే ఆమెతో సంతోషకార్యం నిర్వర్తించి సంతృప్తి చెందడానికి లేదా కనీసం ఆమె వారిని ఒకసారి తాకితే చాలు అనే ఆశతో తమ ఆభరణాలు, సంపత్తులను ఆమె చరనాల్లో ఉంచేసే వారు. కాని ఆమె యవ్వనం ఉడిగిపోయి అందం మసకబారిపోయాక ఎవ్వరూ ఆమెను పట్టించుకోలేదు. రోడ్డు దాటించడం అనేది చాలా దూరపు విషయం!

3) నిజానికి ది మానవ తత్వానికి సంబంధించిన విషయం. రాత్రి నల్లగా, చీకటిగా ఉంటుంది. పగలు అత్యంత కాంతివంతంగా, వేడిగా ఉంటుంది. కాని ఒకేసారి చీకటి నుండి వెలుగులోనికి రావడం జరగదు. అల్లాహ్ ఒక పద్ధతి ప్రకారం పగలును రాత్రిలోనికి ప్రవేశ పెడతాడు. ఈ ప్రక్రియ జరిగేటప్పుడు పగలు

నువ్వు అవలంబించడానికి నీకు చాలా సమయం పట్టింది. నువ్వు కొద్ది కొద్దిగా నీ వస్త్రాలను చిన్నవిగా చేసుకుంటూ పోయావు, ఇందులో భాగంగా ముందు నీ పరదా పల్చగా, పారదర్శకంగా అయ్యింది. దీనివలన నీ ఇంట్లోని పురుషులు నువ్వు ఎటువైపుగా పయనిస్తున్నావో గ్రహించ లేకపోయారు. ఎలాగైతే మీరు చెడువైపునకు వెళ్లారో, అలాగే నెమ్మది నెమ్మదిగా మంచి వైపునకు మరలిరావాలి.

పురుషులు నీ వంకర బుద్ధిని ఆసరాగా చేసుకుని నిన్ను అశ్లీలత్వానికి బానిసగా చేశారు. నీచులు నిన్ను చూసి సంతోషంతో ఆనంద భరితులయ్యే వారు, ఆ స్థితిలో నిన్ను వారు ఎక్కడి వరకు తీసుకువెళ్లారంటే, ఆ స్థితిలో నిన్ను చూడటాన్ని ఇస్లాం ఇష్టపడదు, ఇంకా క్రైస్తవమూ ఇష్టపడదు. అగ్ని పూజారులు కూడా ఈ దారిన నడవలేదు. చివరకు జంతువులు కూడా ఇలాంటి విధానాన్ని అవలంబించవు.

సికందరియా (అలెగ్జాండ్రియా)[4] మరియు బేరూత్[5] బీచ్‌లు, సముద్ర తీరాల వద్ద విదేశీ పర్యాటకులతో ముస్లిం మహిళలు జలకాలాడటాన్ని చూసి కూడా ముస్లిం పురుషులకు సిగ్గూ బిడియం కలగదు. వారు కేవలం ముస్లిం

---

పూర్తయి, రాత్రి ఎప్పుడు మొదలయ్యింది అనేది మనకు తెలియదు. దీనికి ఉదాహరణ గడియారపు చిన్న ముల్లు (గంటలను సూచించేది) దాన్ని చూస్తున్నప్పుడు అది అస్సలు కదలదు. కాని రెండు గంటల దర్వాత చూస్తే కదలకుండా, మెదలకుండా ఉన్న ముల్లు ముందుకు సాగిపోయి ఉంటుంది. అదే విధంగా మానవుడు పాలు త్రాగే పసితనం నుండి పిల్లవాడిగా ఎదుగుతాడు, యవ్వనం నుండి వృద్ధాప్యం లోనికి అడుగుపెట్టాడు. ఇదే విధంగా జాతులలోని పరిస్థితులలో కూడా మార్పు వస్తుంది.

4) సికందరియా అనేది ఈజిప్టుకు చెందిన ప్రాచీన ప్రసిద్ధ నగరం. ఇది సముద్ర తీరంలో వెలసిన ఓడరేవు.

5) రచయిత ఈ వ్యాసం వ్రాసేటప్పుడు లండన్, ప్యారిస్; తర్వాత పడమరన బేరూత్ విశృంఖలత్వానికి, అశ్లీలత్వానికి అన్నింటికంటే పెద్ద అడ్డాగా

మహిళల ముఖాలు, చేతులు మరియు ఛాతీ వరకే కాదు, అతి సున్నిత శరీర భాగాలను తప్ప మొత్తం శరీరాన్ని నగ్నంగా చూసేస్తారు.[6]

నైట్ క్లబ్బులలో, మందు పార్టీలలో ముస్లింలు తమ మహిళలను అపరిచిత పురుషులతో డ్యాన్సులు చేయడానికి అడ్డుచెప్పరు. ఇలాంటి దుష్ట చేష్టలను ముస్లిం పురుషులు తమ కళ్లారా చూసినా వారిలో ఎలాంటి ధార్మిక పౌరుషం జాగృతం కాని దుస్థితి.

ముస్లిం యూనివర్శిటీలలో కూడా దాదాపుగా ఇదే పరిస్థితి నెలకొని ఉంది. ముస్లిం యువకులు, ముస్లిం అమ్మాయిలను పరదా లేకుండా, అర్ధ నగ్నంగా వారితో పాటు కూర్చోబెట్టుకుంటున్నారు. దీన్ని ఏ తండ్రీ వ్యతిరేకించటంలేదు. ముస్లిం మాతృమూర్తులూ దీన్ని చెడుగా భావించటంలేదు. ఇలాంటి దృశ్యాలు మీరు ప్రతీచోటా చూడవచ్చు.

ఇలాంటివే ఇంకా ఎన్నో చెడుగులున్నాయి. వాటిని ఒక్కరోజులోనో లేక ఒక్క పూటలోనో అంతమొందించటం అసాధ్యం. సరైన పద్ధతి ఏమిటంటే, మనం ఎలాగైతే తప్పుదోవ పట్టామో అదే విధంగా నెమ్మదిగా రుజుమార్గం

---

మారిపోయింది. ఇక్కడ పాపాలు ఎప్పుడూ తగ్గుముఖం పట్టలేదు. లెబనాన్ రాజధాని అయిన ఈ నగరం పరిస్థితి నేడు ఎలా ఉందంటే తమ పాపాల పర్యవసానంగా ప్రతీ చోట వినాశమే కనబడుతుంది. శాశ్వతంగా బాంబులకు లక్ష్యమై పోయింది. ఇప్పుడు ఇక్కడి వినాశపు సమాచారాన్ని ప్రపంచానికి అందించడానికి కేవలం విలేఖరులు మాత్రమే ఇక్కడకు వస్తున్నారు. ఇలా ఒకటి లేదా రెండు సంవత్సరాలుగా కాదు అనేక సంవత్సరాలుగా జరుగుతూ వస్తుంది. పడమరకు చెందిన ఈ అందమైన, అభివృద్ధి చెందిన నగరం ఇప్పుడు వినాశానికి ఉదాహరణగా నిలిచిపోయింది. తాజా పరిస్థితి (సెప్టెంబర్ 1988) ఎలా ఉందంటే, ఇక్కడ నమ్మశక్యంగా లేని పరిస్థితుల వలన బ్యాంకు అధికారులు వారితో వ్యాపార లావాదేవీలను నిలిపివేస్తునట్లుగా ప్రకటించారు.

6) ఇప్పుడు మిగిలిన ఆ ప్రదేశాలను కూడా వారి ముందు మహిళలు బహిర్గత పరుస్తున్నారనీ తెలిసింది.

వైపుకు కూడా రావాలి. బహుశా ఈ ప్రయాణం చాలా సుదూరమైనది కావచ్చు. సుదూర ప్రయాణానికి భయపడేవారు ఎన్నటికీ తమ గమ్యాన్ని చేరుకోలేరు. ఈ చెడుగును అంతమొందించే ప్రయత్నం చేయటానికి ముందుగా యువతీ యువకులు ఏకాంతంలో కలివిడిగా ఉండటాన్ని వ్యతిరేకించాలి.

ఇక ముఖాన్ని కప్పి ఉంచే విషయానికి వస్తే, అమ్మాయిల శీలానికి ఏ విధమైన ముప్పు లేనప్పుడు వారు తమ ముఖాన్ని కప్పి ఉంచుకోవలసిన అవసరం లేదు. మనం దేనినైతే 'హిజాబ్' అంటున్నామో దాన్ని సిరియా దేశ వాసులు పరదా కంటే మెరుగైనదిగా భావిస్తున్నారు. వారు కప్పి ఉంచవలసిన అవయవాలను కప్పి ఉంచడానికి దీన్ని ఉపయోగించరు. వారి అందచందాలను ద్విగుణీకృతం చేసే మరియు చూపరులను ఆకట్టుకునే సాధనంగా దీన్ని వారు వాడుకుంటున్నారు.

సాధారణంగా ముఖాన్ని కప్పి ఉంచకపోవటం నిషిద్ధమేమీ కాదు. కాని దాన్ని కప్పి ఉంచటం ఉత్తమమైనది. ఉపద్రవాలు జరిగే అవకాశం ఉన్నప్పుడు, చెడులకు తావు ఉన్నప్పుడు అయితే ముఖానికి కూడా పరదా పాటించడం తప్పనిసరి. స్త్రీ పురుషులు విశృంఖలం, కలివిడితనంతో మెలగటం అనేది వేరే విషయం!

పరదా రాహిత్యంలో ఇంకా ఈ క్రింది విషయాలు కూడా వస్తాయి : ఏ అమ్మాయి అయినా మహ్రమ్ (వివాహానికి నిషిద్ధమైన బంధువు) లేకుండా అపరిచిత పురుషులతో విశృంఖలంగా, కలివిడితనంతో మెలగటం, పరదా లేకుండా ఏ స్త్రీ అయినా తన భర్త స్నేహితులను ఇంట్లోకి ఆహ్వానించటం, ఒక వేళ వారు ప్రయాణంలో ఉంటే తోటి ప్రయాణికులై పోవడం, రోడ్డు మీద కనబడినప్పుడు సలాములు, మాటామంతీ సాగించడం లేదా ఎవరైనా అమ్మాయి యూనివర్శిటీ స్నేహితుడితో కరచాలనం చేస్తే లేదా ఇద్దరూ కలిసి

మొహమాటం లేకుండా మాట్లాడుకుంటూ నడుచుకుంటూ పోతూ, అల్లాహ్ వారిలో ఒకరిని అమ్మాయిగాను, మరొకరిని అబ్బాయిగాను పుట్టించాడనే విషయాన్ని మరచిపోయి, కొంతదూరం నడిచిన తర్వాత ఒండొకరు ఆకర్షితులై ఒకరికొకరుగా కలిసిపోతారు. అల్లాహ్ సృష్టిని మార్చటం ఆమె వశంలోనూ లేదు, అతని వశంలోనూలేదు. ప్రపంచం మొత్తం కలిసి ప్రయత్నించినా దాన్ని మార్చలేరు. ఆ ఇద్దరి మనస్సులలో జనించే కోరికను అంతమొందించటం ఎవరి తరమూ కాదు.

సంస్కృతి పేరుతో "స్త్రీ పురుష సమానత్వం" అని నినదించే పురుషులు రెండు విధాలుగా అబద్దాలకోర్లు.

మొదటిది, ఈ విధమైన వ్యాఖ్యలు చేసే పురుషుల ఏకైక ఉద్దేశ్యం, తమ మనో వాంఛలను, పాశవిక కోరికలను తీర్చుకోవడం, చూపు లతో తృప్తిని పొందడం. కాని ఇలాంటి వారు తమ కోరికలను బాహాటంగా నోరు విప్పి చెప్పలేరు. అందువలన పరోక్షంగా తమ కోరికలకు భారీ సంభాషణల ముసుగు తొడిగి వాటిని వెలిబుచ్చుతారు. ఉదాహరణకు, సంస్కృతి, కళ, లింగబేధభావాలు లేకుండా స్త్రీ పురుషులు కలివిడిగా ఉండడం అనేవి. నిజానికి వారి దృష్టిలో వాటికి ఏ విధమైన విలువా లేదు.

వారి మాటలు అబద్ధాలు అనటానికి రెండవ రుజువు ఏమిటంటే, వారు ఆదర్శంగా భావించే యూరప్ ముద్ర లేనిదే ఏ విషయాన్నీ వారు నమ్మరు. ప్యారిస్, లండన్, బెర్లిన్ మరియు న్యూయార్క్‌ల నుండి వచ్చిన సంస్కృతియే వారి కొరకు ఆచరణ యోగ్యమైనది. అది డ్యాన్స్ అయినా, అశ్లీలత్వమైనా, యూనివర్శిటీలలో విశృంఖల కలివిడితనంతో మెలగడమైనా, స్టేడియం, సేదతీరే ప్రాంతాలలో పరదా రాహిత్యంతో తిరగటమైనా, బీచ్‌ల వద్ద అర్ధనగ్నంగా విహరించటం అయినా, ఇవన్నీ వారికి సరైనవిగానే తోస్తాయి. జామియా అజ్‌హర్, జామియా అమ్‌వా, మదర్సాలు, మస్జిద్‌ల

నుండి అలవడే అన్ని అలవాట్లు, మహోన్నత వ్యక్తిత్వం, హితబోధలు మానసిక పరిశుద్ధత, పవిత్రత మరియు దేహ పరిశుద్ధత ఇలాంటివన్నీ వారి దృష్టిలో అసత్యాలు మరియు ఆచరణకు పనికిరానివి.

యూరప్, అమెరికాల గురించి నేను చదివినదీ, అక్కడకు రాకపోకలు సాగించిన వ్యక్తుల నుండి నేను తెలుసుకున్న విషయమేమిటంటే, అక్కడ కూడా విచ్చలవిడి తిరుగుళ్ళను ఇష్టపడని, దానికి పాల్పడని కుటుంబాలు చాలా ఉన్నాయి. స్వయంగా ప్యారిస్‌లో కూడా తల్లిదండ్రులు ఈడొచ్చిన తమ ఆడపిల్లలను యవ్వనంలో ఉన్న అబ్బాయిలతో కలిసి తిరగనివ్వరు. వారు తమ పిల్లలను ఉత్తమ సాంప్రదాయాలను పాటించే వారిగా తీర్చుదిద్దు తారు. దీనివల్ల తమ పిల్లలు పాపకార్యాలు, అశ్లీలత్వం నుండి పవిత్రంగా ఉంటారనే నమ్మకం వారికి కలుగుతుంది. యూరప్, అమెరికాలలో అశ్లీలత, ప్రేమ కథలు గల నాటకాలు బహిరంగంగా నడిపే ప్రదేశాలు కూడా ఉన్నాయి. ఈజిప్టుకు చెందిన అశ్లీలత్వానికి అలవాటు పడ్డ కొన్ని కంపనీలు వాటికి 'సినిమా' అనే పేరు పెట్టి ఆ దుష్ట సంస్కృతికి కొమ్ముకాస్తున్నాయి. వారు ఎలాగైతే సత్య ధర్మం తెలియని అజ్ఞానులో, అదే విధంగా సినిమా వినోదం తెలియని అజ్ఞానులు కూడాను.

స్త్రీ స్వేచ్ఛ పేరుతో జెండాలు పట్టుకుని ఊరేగే వారి వాదాన్ని కొంచెం పరిశీలించండి: "స్త్రీ పురుషులు స్వేచ్ఛగా కలివిడిగా ఉండి, విచ్ఛలవిడిగా తిరిగినట్లయితే, ఇది వారిలోని చెడుగులను త్రుంచివేస్తుంది. ఇంకా వారిలోని నైతిక విలువలను కాపాడుతుంది. దీనిద్వారా లైంగిక కోరికలను అదుపు చేయవచ్చు."

కళాశాలలో, యూనివర్శిటీలలో స్వతంత్రంగా, కలివిడిగా తిరిగిన వారి అనుభవాలపై నేను దీని సమాధానం వదిలి వేస్తున్నాను. వారే దీనికి సరైన సమాధానం ఇవ్వగలరు. నువ్వు ఈ వాస్తవాన్ని గమనించలేదా? రష్యా

ధార్మికతను, నైతిక విలువలను బొత్తిగా పట్టించుకోని దేశం. అది ఏ పండితుడు లేదా పాదరీల ఫత్వాలు కూడా వినదు. అయినప్పటికీ స్వేచ్ఛా లైంగిక విశృంఖలత్వపు చెడుగులను తన కళ్లతో తాను స్వయంగా చూసిన తర్వాత ఆ దేశం వాటి నుండి మరలిపోలేదా?

ఇక అమెరికా విషయానికొస్తే, అక్కడ వున్న పెద్ద సామాజిక సమస్య గర్భవతులైన విద్యార్థినులు. ఇలాంటి సమస్య ఈజిప్టు, సిరియా ఇతర ముస్లిం దేశాలలో చూసిన ఏ వ్యక్తికైనా సంతోషం కలుగుతుందా?

ఇప్పుడు నేను యువకులను ఉద్దేశించి మాట్లాడట్లేదు. వారు వినాలనే కోరికా నాకు లేదు. ఎందుకంటే వారు నా మాటలను పట్టించుకోరు. నేను వారిని, వారి రుచుల నుండి దూరం చేస్తున్నందువల్ల నా మాటలను వారు "నా మూర్ఖత్వం" అని అనువదిస్తారు. ఇలా చెప్పటం ద్వారా వారు ప్రత్యక్షంగా లబ్ధిపొందినట్లు స్వయంగా వారే సాక్ష్యమిస్తున్నారు.

నా కుమారీ! నేను కేవలం నిన్ను ఉద్దేశించి మాత్రమే సంబోధిస్తున్నాను.

ఓ నా ధర్మపరాయణ మరియు విశ్వాసురాలైన కుమారీ!

ఓ నా ఔన్నత్యం గల, నిష్టాపరురాలైన కుమారీ!

గైర్ మహ్‌రమ్ (వివాహానికి నిషిద్ధం కాని వారు)ల ఒళ్లోకి వెళ్లి వాలిపోతే, నువ్వే బలి పశువ్వి అవుతావని గుర్తుంచుకో. ఇబ్లీస్ బలిపీఠంపై బలి కావడానికి అడుగు ముందుకు వెయ్యకు. వ్యభిచారం, విశృంఖలత్వానికి చెందిన తేనెలొలికే మాటలు అల్లే వారి మోసంలో నువ్వు పడవద్దు.

స్వతంత్ర ఆలోచనలు, సంస్కృతి, కళ, ఆధునికత, అభివృద్ధి వీటినే సంపూర్ణ జీవితంగా పేర్కొంటున్న వారి మాటలను నువ్వు ఎన్నటికీ నమ్మకు. వారిలో ఎక్కువ మంది భార్యా పిల్లలు లేని పురుషులే ఉన్నారు.

వారు నీ వద్దకు తాత్కాలిక ఆనందాన్ని పొందడానికే వస్తారు తప్ప మరే ఇతర మంచి ఉద్దేశ్యంతోనూ రారు.

ఇక నా విషయానికి వస్తే, నేను ఆడపిల్లల తండ్రిని, నేను ప్రజల

విషయాల్లో మాట్లాడేటప్పుడు, నిజానికి నేను నా కుమార్తెల పక్షాన్నే ఉంటాను.

పురుషుల తీపికబుర్లు, మోసపూరితమైన మాటలలో చిక్కుకుని, కళంకితగా నిలిచిన అమ్మాయి విలువైన గౌరవము తిరిగిరాదు. ఆమె గొప్పతనూ కానరాదు.

ఆ అమ్మాయి మానమర్యాదలూ తిరిగిరావు.

ఏ అమ్మాయి అయినా కాలు జారితే, అప్పుడు ఏ పురుషుడూ ఆమెకు తోడుగా ఉండడు, ఆశ్రయాన్నీ కల్పించడు. అభివృద్ధి దిశగా పయనించనివ్వడు అనేది జగమెరిగిన సత్యం.

నీ అందచందాలకు ముగ్ధులై నీ వెంటపడే పురుషులందరి హృదయాల లోనూ, నీ అందచందాలు ఉన్నంత వరకే వారు ప్రేమను కలిగి ఉంటారు. నీ సౌందర్యం ఉడిగిపోయి తర్వాత మాంసంలేని శవం దగ్గర నుండి కుక్క ఎలా వెనుదిరిగి వెళ్లిపోతుందా సరిగ్గా అదే విధంగా వారి ప్రేమా కనుమరుగవు తుంది.

ప్రియ కుమారీ!

నీకు నేను ఇచ్చే హితోపదేశం ఇదే. ఇదే సత్యం కూడాను. నువ్వు పురుషుల మోసపూరితమైన మాటలను స్వాగతించకు.

ఇది తెలుసుకో!

నీ శీలం, మానమర్యాదలు నీ చేతుల్లోనే ఉన్నాయి.

మా పురుషుల చేతుల్లో లేవు.

నువ్వు తలచుకుంటే, ధైర్యంగా ఉండగలిగితే నిన్ను నువ్వు రక్షించు కోగలవు. అప్పుడు నీ సౌశీల్యత, మంచి నడవడికలతో పూర్తి ముస్లిం సమాజం కళ్లుతెరిచి రుజుమార్గం పైకి వచ్చేస్తుంది.

వస్సలాం
అలీ తన్‌తావి

# ప్రియ కుమారా!

క్రింద ప్రత్యుత్తరం శ్రీ మీమ్-రే గారి కొరకు వ్రాయబడినది. ఇతను ఈజిప్టుకు చెందిన ఇస్మాయీలియా నగర వాసి. అతను వ్రాసిన ఉత్తరాన్ని నన్ను చదివి సమాధానం ఇవ్వవలసినదిగా మరీమరీ కోరటం ఆయనకు సమాధానంగా ఈ ప్రత్యుత్తరం వ్రాశాను[7]

కుమారా! నాకు ఈ ఉత్తరం వ్రాస్తున్నప్పుడు నువ్వు ఎందుకు ఇంతగా మొహమాటపడుతున్నావు? ఎందుకు నువ్వు అంతగా సిగ్గుపడుతున్నావు? కేవలం నీ ఒక్కడిలోనే ఈ చెడుగు నిలిచి వుందని నువ్వు అనుకుంటున్నావా? నువ్వు ఏమైనా మానవాతీత ప్రత్యేకతలను కలిగి ఉన్నావా?

ఎంత మాత్రం కాదు; ప్రియ కుమారా! దీనికి ఎక్కువగా చింతించాల్సిన అవసరం లేదు. శాంతించు, నువ్వు ఒక్కడివే ఈ రోగానికి గురై లేవు. ఈ రోగం చాలా వరకు ప్రతీ యువకుడికీ అంటుకుని ఉంది. నేను దీని గురించి గతంలో కూడా ఎన్నో వ్యాసాలు వ్రాశాను. ఇప్పుడు కూడా వ్రాస్తున్నాను. పాత మాటలను మళ్ళీ మళ్ళీ చెప్పడం ఎవరికీ రుచించదు. అలా అని పాత వ్యాసాలనే అంటగట్టడం నా అలవాటూ కాదు. ఒకవేళ ఇలా అయివుంటే నీ కోసం కూడా వాటిలో కొన్నింటిని తిరగవ్రాసేవాణ్ణి లేదా కనీసం వాటిని చూసుకోమని నీకు తెల్పి ఉండేవాణ్ణి.

పదిహేడు సంవత్సరాల వయస్సులోనే యవ్వనపు కోరికలు నిన్ను కలవరానికి గురిచేసినట్లయితే అందులో ఆశ్చర్యపడవలసిన విషయమేమీ

7) 1988లో ఈ ఉత్తరం ప్రచురించబడింది.

లేదు. ఎంతో మంది పెద్దల మరియు పిన్నల నిద్రలను ఈ కోరికలు హరించి వేశాయి. విద్యార్థులను విద్య నుండి తప్పించేవి, కార్మికుడి పనిమీద ఆసక్తి నుండి, వ్యాపారి ఆలోచన వ్యాపారం నుండి మరల్చేవీ ఈ కోరికలే! ఈ కోరికల రుచులను, అందాలనూ, మాధుర్యాలతో ముంచెత్తే ప్రేమగీతాలను కవులు అనేకం అల్లారు. వీటి విరహంపై రచయితలు ప్రేమ కథలు వ్రాసేశారు. నువ్వు ఇప్పుడు పొందుతున్న అనుభూతి కూడా అలాంటిదే. భేదం ఏమైనా ఉందంటే, అది నువ్వు ప్రేమను నగ్నం గానూ, పారదర్శకంగానూ చూశావు. అందువలన నీలో దీని గురించి ఎలాంటి తప్పుడు అభిప్రాయమూ ఏర్పడలేదు. ఇతరులైతే దీని గురించి తాము స్వయంగా మోసపోరు, కానీ ఈ సత్యాన్ని ఇతరులకు తెలియకుండా దాచేస్తారు. ఇతరులను మోసగించేందుకు దీనిపై మనస్సులను కొల్లగొట్టే అందమైన మాటల లేబిల్ అతికించేశారు. నీ ఉదాహరణ ఎలాంటిదంటే, నువ్వు నది నుండి నేరుగా నీళ్లు తీసుకుని త్రాగిన వాడివి. వారి ఉదాహరణ, బంగారు వన్నె పాత్రలో నుండి నీరు త్రాగిన వ్యక్తి లాంటిది. ఆ పాత్రపై బంగారపు పోతపోయబడి, దాని అంచులపై అందమైన డిజైన్‌లు చెక్కబడి ఉన్నాయి. ఆ పాత్ర కూడా అబూ నవాస్[8] ది అయి, దానిలో కిస్రా రాజరికపు రంగు పూయబడి ఉంది. లేదా నీ ఉదాహరణ నదిలోని నీరుతో పోల్చితే, వారి ఉదాహరణ చెరువులోని నీరు వంటిది.

---

8) ఉర్దూ సాహిత్యంలో మద్యాన్ని గురించి వివరించటంలో రియాజ్ ఖైరాబాదీ పేరు ప్రఖ్యాతిగాంచినట్లే, అతని కంటే ఎక్కువగా అరబీ సాహిత్యంలో అబూనవాస్ పేరు ప్రఖ్యాతి గాంచినది. ఇతను అబ్బాసీ కాలానికి చెందిన ప్రసిద్ధ కవి. మద్యం కంటే ముందుకు పోయి, యవ్వనం గురించి అనగా లైంగికాకర్షణను గురించిన లిటరేచర్‌లో పాశ్చాత్యులు సైతం ఈ నీచకవిని ప్రమాణంగా తీసుకున్నారు.
"The Cardle of Erotica" by allen edwardes of R.E.L.Masters, Published by : Lancer Book New Yark - 10036 (U.S.A), 1968, Page 49-50.

నువ్వు నీ లేఖలో పేర్కొన్న లైంగిక కోరికలే కవుల కవితల్లోనూ, చిత్రకారుల పెయింటిగ్స్‌లోనూ, గాయకుల గొంతుకల్లోనూ ప్రతిబింబిస్తాయి. కాని రెండింటి మధ్య ఉన్న ప్రధాన బేధం ఏమిటంటే, నువ్వు పూర్తిగా వ్యక్తీక రించావు. వారు పూర్తిగా గుప్తంగా ఉంచారు. నిజానికి లోలోన దాచే వైఖరి కలిగి ఉండటమే అతినీచమైన రోగం.

ఏ బాలుడైనా నీ వయస్సుకు చేరుకున్నప్పుడు అతనిలో నిర్లిప్తంగా ఉన్న లైంగిక కోరికలు ఒక్కసారిగా మేల్కొని కలవరానికి గురిచేస్తాయి. దీని ప్రభావం వల్ల అతను తన చుట్టూ పరిసరాలను పరిశీలిస్తాడు. అప్పటి నుంచి అతని దృష్టిలో ప్రపంచమే మారిపోతుంది. మనుషులను కూడా అతను వేరే దృష్టితో చూడనారంభిస్తాడు. అందువల్లనే అతను స్త్రీని మాంసం, ఎముకలతో ఏర్పడిన మనిషిగా భావించడు. సాధారణ మానవులలో ఉండే విషయాలే ఆమెలోనూ ఉంటాయి. వారిలో ఉండే లోపాలే ఆమెలో కూడా కన్పిస్తాయి. కాని అతని మదిని స్త్రీయే ఆక్రమించుకుంటుంది. అన్ని కోరికలూ ఆమె వద్దనే నిలిచిపోతాయి. యువకులు తమ మనోభావాలకు ఎలాంటి ముసుగు తొడిగిస్తారంటే అందులో అన్ని లోపాలూ దాగిపోతాయి. పై నుండి క్రింది వరకు వారికి కేవలం స్త్రీలోని అందమే కనబడుతుంది. ఒక విగ్రహారాధకుడు తన చేతులతో రాయిని చెక్కి దాన్నే దైవమని భావించి పూజించినట్లుగానే, అతను కూడా తన మస్తిష్కంలో స్త్రీ రూపాన్ని దిద్దుకుని దాన్ని పూజిస్తుంటాడు. విగ్రహారాధకుడికి రాయి దేవత అయితే, ప్రియుడికి స్త్రీ ఒక ఊహా దేవత!

వీటన్నింటికీ ఆలోచనలతో సంబంధం ఉంటుంది. కాని బుద్ధికందని

---

1968 వరకు ఈ పుస్తకపు 1,50,000 కాపీలు అమ్ముడు పోయాయి.
పైన పేర్కొనబడిన ఈ పుస్తకంలో రచయిత 122-123 పేజీలలో ప్రియ ప్రవక్త (స) వారిని కించపరిచి, దుర్భాషలతో కూడిన వ్యాఖ్యలు చేశాడు.

విషయం ఏమిటంటే, అబ్బాయిల వయస్సు 20-25 సంవత్సరాలకు చేరే వరకు విద్యాలయాల్లో వారిని ఉంచటం జరుగుతుంది. ఈ సమయంలోనే యవ్వనం ప్రారంభమై లైంగిక కోరికల ప్రభావం అతనిపై ఉంటుంది. శరీరం కూడా ఉద్రిక్తతకు, అసహనానికి గురవుతుంది. ఈ కాలంలో ఆ యువకుడు "చేస్తే ఏమి చెయ్యాలి" అనేది ఇక్కడ ఉత్పన్నమయ్యే ప్రశ్న.

అసలు సమస్య ఇదే. మనస్సును సంతృప్త పరచుకోవడానికి ఎన్నో మార్గాలున్నాయి.

ఆ యువకుడు అవలంబించే ఉపాయాలలో మొదటిది అతను తన మనో వాంఛలను, అవసరాలను మరియు లైంగిక కోరికలను పట్టించుకోక పోవటం. తర్వాత వాటి వివిధ కోణాలను విశ్లేషించి ఆలోచించటం, అశ్లీల రచనలు చదవటం, అలాంటి సంఘటనలను వినడం, అశ్లీల చిత్రాలను చూడటం వల్ల ఆ కోరికలకు రెట్టింపు బలం చేకూరి అతని మనస్సు సంతుష్ట మవుతుంది. అతని చెవుల, కళ్ల నరాలపై కూడా వాటి ప్రభావం నిలిచిపోయి అతను ఖగోళశాస్త్రం పుస్తకం తెరచి కూర్చున్నప్పుడు అందులోనూ, పౌర్ణమి చంద్రుడిలో, సూర్యోదయ కిరణాలలో, రాత్రి చీకట్లలోనూ, నిద్రలోనూ మెలకు వతో ఉన్నప్పుడు, కలల్లోను ఇంకా ప్రతీ చోట అతనికి అవే మెదులుతుంటాయి.

నువ్వు ఆ వ్యాపకానికి గురికానంతవరకు లేదా దానికి బానిస కానంత వరకు ఇదే పరిస్థితి కొనసాగుతుంది.

రెండవ పద్ధతి, దేన్నైతే ఇప్పుడు హస్త ప్రయోగం (**Masturbation**) అని అంటున్నారో అది. దీన్ని గతంలో ఇతర పేర్లతో పిలిచేవారు. దీని గురించి ధర్మవేత్తలు వివరణలిచ్చారు, కవులు దీనిలోని మహత్తును వర్ణించి కవితలు అల్లారు. సామాజిక విలువల గురించి వ్రాసిన పుస్తకాల్లోనూ దీని కొరకు ప్రత్యేక అధ్యాయాన్ని నెలకొల్పారు. హస్త ప్రయోగం ద్వారా లైంగిక తృప్తిని పొందే పద్ధతి మొదట పేర్కొన్న పద్ధతి, దీని తర్వాత పేర్కొనబడే

పద్ధతులతో పోల్చితే వాటి కంటే స్వల్ప చెడుగును, నష్టాన్ని కలిగించేదీను[9] కాని ఒకవేళ ఇది హద్దుమీరితే శరీరం అనారోగ్యానికి గురవుతుంది. అలాంటి వ్యక్తి యవ్వనాన్ని సయితం వృద్ధాప్యంగా భావిస్తుంటాడు. అతని వ్యక్తిత్వం మసిబారి పోతుంది. నిరాశా నిస్పృహలకూ గురవుతాడు. నలుగురిలో ఉండ డానికి ఇష్టపడడు. అంతేకాక ప్రజల ముందుకు రావడానికీ అతనికి ధైర్యం చాలదు. బ్రతుకును వెళ్లదీయడాన్ని కష్టంగా భావిస్తుంటాడు. ఈ లక్షణాలన్నీ అతన్ని జీవచ్ఛవంగా మార్చివేస్తాయి.

మూడవ మార్గం, నిషిద్ధ కార్యాల బంధనాల్లో చిక్కుకుని రుజుమార్గం నుండి తప్పిపోయే విధానాలను అవలంబించడం ఈ మార్గాన్ని అనుసరించే వారు వేశ్యాగృహాల వైపు మరలి, క్షణికానందం కోసం తమ ఆరోగ్యం, యవ్వనం, భవిష్యత్తు మరియు ధర్మం అన్నింటినీ బలిచేసేస్తారు.

దేని కోసమైతే నువ్వు పోరాడే వాడివో, ఏ ఉన్నత స్థానంలో అయితే నువ్వు శాశ్వతంగా ఉండాలని ఉవ్విళ్లూరేవాడివో ఆ మార్గం నుండి నువ్వు ఇప్పుడు తప్పిపోయి నీ భవిష్యత్తును అంధకారమయం చేసుకుంటున్నావు. నీ పురోగతికి సోపానాలైన విద్యాజ్ఞానాలు కూడా నీకు దూరమయ్యాయి. దీన్ని ఆధారంగా చేసుకుని నువ్వు నీ గుర్తింపును, ప్రత్యేకతను నిలబెట్టుకోవ డానికి రణరంగంలో దూకడానికి సిద్ధమయ్యావో ఆ శారీరక బలం, ఆ పురుషత్వం ఇప్పుడు నీలో నీరుగారిపోయాయి.

ఒకరితో అక్రమ సంబంధం నెలకొల్పుకున్న తర్వాత నువ్వు ఇక సంతృప్తి పొందుతావని ఎన్నటికీ భావించకు. దీని తర్వాత వేరేవారి వైపు నీ దృష్టి పడకుండా ఉండటం అన్నది అసాధ్యం. ఒక అందమైన కోమలాంగితో

---

9) ఇక్కడ ఈ పద్ధతిని అవలంబించమని సలహా ఇస్తున్నట్లు అర్థం ఎంతమాత్రం కాదు. పెద్ద పెద్ద డాక్టర్లు వ్యక్తీకరించిన విషయాన్నే నేను తెల్పాలనుకుంటు న్నాను. ఈ విషయంలో వారు గుప్త విషయాలను పరిశీలించే ధర్మవేత్తల అభిప్రాయంతో విభేదించారు.

సుఖం పొందినప్పుడు వేరే వారితో కూడా అలాంటి సుఖాన్ని పొందాలనే తృష్ణ నీలో పెరిగిపోతుంది. కారణం ఏ వ్యక్తి అయినా ఉప్పు నీరు త్రాగి నప్పుడు, అది దాహం తీర్చడానికి బదులుగా అతని దాహాన్ని మరింత పెంచుతుంది. నువ్వు ఎంతమంది స్త్రీలతో స్నేహాలు చేసిన తర్వాత కూడా ఎవరైనా అందమైన యువతి నీ దృష్టిలో పడి, ఆమె నీ వైపునకు మరలకుండా ముఖం తిప్పుకుంటే, అప్పుడు ఎట్టి పరిస్థితులలోనైనా ఈ "ఒక్క" అమ్మాయిని పొంది తీరాలనే బలమైన కోరిక నీకు కలుగుతుంది. అలాకాకుండా ఆమె చేతికందిన తర్వాత తప్పించుకుంటే అప్పుడు ఆడదాన్ని ఎరుగని వ్యక్తికి బాధ కలిగినట్లుగానే నీకూ బాధ కలుగుతుంది.

దీనికి షాహ్ ఫారుఖ్[10] ఉదాహరణ నీ ముందుంది.

ఆ కోమలాంగులతో నువ్వు కోరినవన్నీ పొందావనే అనుకుందాం. నీ దగ్గర సిరిసంపదలు కూడా అత్యధికంగా ఉండి అవి నీ ఆధీనంలోనే ఉన్నాయనుకుందాం. కానీ నీ శరీరం నీకు సహకరిస్తుందా? నీ హద్దుమీరిన కోరికలను నీ ఆరోగ్యం సహించగలదా? ఇది గొప్ప గొప్ప పురుషులను నామరూపాల్లేకుండా చేసివేసింది. ఎంతో మంది పహిల్వానులు, వెయిట్ లిఫ్టర్లు, షూటర్లు, రన్నర్లు మరియు ఇలాంటి అనేక ప్రముఖ సెలబ్రిటీలు తమ మితిమీరిన లైంగిక కోరికలకు దాసులై, వాటిని తీర్చుకోవడంలో నిమగ్నులై తమ కెరియర్‌కు శాశ్వతంగా దూరమయ్యారు. వారి పరిస్థితే అలా ఉంటే, మరి నీ విలువ ఏమిటి? అల్లాహ్ గొప్పదనం ఏమిటంటే, ఆయన ఉత్తమ నైతిక విలువలు కలిగిన వారికి ఆరోగ్యం మరియు సంతోషాలను ఇచ్చి వారికి లాభాన్ని కలిగిస్తాడు. అదేవిధంగా అనైతికతా వైఖరి కలిగిన వ్యక్తులకు అనారోగ్యం మరియు రోగాల[11]రూపంలో శిక్ష ఇచ్చివేస్తాడు.

---

10) ఇతను ఈజిప్టు రాజు. ఇతను జమాఅత్ అబ్దుల్ నాసర్ కంటే ముందుగా వచ్చిన రాజు. ఇతను భోగభాగ్యాలు అనుభవించటంలో ప్రసిద్ధి గాంచినవాడు.

11) గుణపాఠం నెరపడానికి అల్లాహ్ అప్పుడప్పుడు కొన్ని భయపెట్టే కారకాలను

ఎంతో మంది యువకులు జీవితంలో ముప్ఫై వసంతాలు కూడా పూర్తి చేసుకుని ఉండరు. కాని వారి చెడునడత వల్ల అరవై సంవత్సరాల వృద్ధులుగా కనిపిస్తుంటారు. ఎంతోమంది తమ సౌశీల్యత, ఉత్తమ నడవడిక వల్ల అరవై సంవత్సరాల వయస్సులోనూ, ముప్ఫై సంవత్సరాల యువకుల మాదిరిగా చురుకుగా ఉంటారు. ఆంగ్లంలో ఒక సామెతను నేను విన్నాను. అది ముమ్మాటికీ సత్యమైనదీ, సరైనదీను అది :

"ఎవరి యవ్వనం సురక్షితమో, వారి వృద్ధాప్యమూ సురక్షితమే"

పురుషులు నిష్ఠతో అశ్లీల నవలలు, కథలు చదవకపోతే, నగ్న ఫోటోలు, బ్లూ సినిమాలు చూడకపోతే, కోరికలను ఉద్రిక్తపరిచే ప్రదేశాల్లో ఉండకపోతే, మహిళలు బజారుల్లో పరదా లేకుండా సంచరించకపోతే మరియు అశ్లీల పదజాలాల ప్రభావం లేకపోయినట్లయితే నెలలో ఒకటి లేదా రెండు సార్ల కంటే ఎక్కువగా అతని శరీరంలో ఉద్రేకం కలగదు. శాస్త్రీయంగా రుజువైన సత్యం ఏమిటంటే, జీవులు నిమ్నస్థాయి నుండి ఉన్నత స్థాయికి ఎదిగే కొద్దీ వారి లైంగిక సామర్ధ్యం కూడా తగ్గుతూ వస్తుంది. గర్భం దాల్చే సమయం పెరుగుతూపోతుంది.

మనం కోళ్లను పరిశీలించినట్లయితే వాటిలో లైంగిక కలయిక అనే ప్రక్రియ ప్రతీరోజూ కొనసాగుతుంది. వాటి దేహ నిర్మాణం (గుడ్డు) రీత్యా

---

పంపిస్తూ ఉంటాడు. ఈ రకానికి చెందినదే ఎయిడ్స్. దీనిని ఇప్పుడిప్పుడే గుర్తించారు. దీనికి మందుగాని, చికిత్స గాని ఇప్పటి వరకూ కనుగొనలేదు. ఈ మహమ్మారి అశ్లీల, నిషిద్ధ, లజ్జాహీన కార్యాలు చేసిన వారికే అంటుకుంటుంది. ఒకవేళ ఈ మహమ్మారి మందు తెలియజేసినా, లజ్జాహీన కార్యాలలో నిమగ్నమై ఉండేవారి కొరకు వేరే వ్యాధిని కలగజేస్తాడు. దాని మందును కూడా వారు కనుగొంటే, వారిపై పెద్ద శిక్ష అవతరిస్తుంది. దాన్ని ఎవరూ ఆపలేరు, మళ్లించనూ లేరు. ప్రళయదినం నాడు నరకం ముందుంచబడుతుంది. అది అవిధేయులను, పాపాత్ములను ఇంధనంగా చేసుకుంటుంది. అల్లాహ్ మనల్ని రక్షించుగాక!

గర్భం సమయం ఒక్క రోజు మాత్రమే. కాని పిల్లుల (క్షీరదం-పిల్లకు పాలిచ్చి పోషించే జీవులు)లో లైంగిక కలయిక సంవత్సరంలో కేవలం ఒక్కసారి లేదా రెండు సార్లు మాత్రమే జరుగుతుంది. అందువలన అవి సంవత్సరంలో కేవలం ఒక్కసారి లేదా రెండు సార్లు మాత్రమే గర్భం దాలుస్తాయి. పిల్లితో పోల్చితే మానవుడు జ్ఞాన సంపన్న జీవి అన్నది నిరాకరించరాని సత్యం. మరి ఏ కారణంవల్ల పిల్లి లైంగిక కలయిక కొరకు ఒక కాలం (మా అరబ్‌లో ఈ ప్రక్రియ ఫిబ్రవరి నెలలో జరుగుతుంది) నిర్ణీతమైఉంటే, కొందరు మానవులు సంవత్సరమంతా 'ఫిబ్రవరి' నెల అయిపోవాలని కోరుకుంటున్నారు? దీని వెనుక కొన్ని ఉపాయాలు మరియు కాంక్షలు దాగి ఉండటం వల్ల ఇలా జరుగుతుంది.

చెడుగుల వైపునకు పిలిచే వారి, షైతాన్ వైపు నుండి సమర్పించబడే ఈ ఉపాయాలు, కాంక్షలు అత్యంత ప్రమాదకరమైనవి. వాటిలో స్త్రీ కొరకు పరదా రాహిత్యం, ఇంకా అలంకరించుకుని బయటకు వెళ్లి పురుషులతో కలివిడిగా ఉండాలనే తలంపు, మహిళల సమానత్వం పేరుతో మగవాళ్లతో కలిసిమెలసి ఉండటాన్ని గౌరవప్రదమైనవిగా భావించడం కూడా చేరి ఉన్నాయి.

కసాయికి మేకతో ఎలాంటి అవసరముంటుందో, స్త్రీలతో పురుషులకూ అంతే అవసరముంటుంది. కసాయి మేకను మేపి, కాపలా కాసి రక్షణ కల్పించి, దాన్ని బలిసేలా తయారు చేస్తాడు. కాని ఎందుకు; జిబాహ్ చేయడానికి!

నేడు అనేక దేశ, విదేశీయ మ్యాగజైన్లు హీరోయిన్ల నగ్న ఫోటోలు, వ్యాయామం సాకుతో స్కూల్ విద్యార్థుల, సమ్మర్ టూర్‌ల సాకుతో బీచ్‌ల వద్ద ఆనందంగా జలకాలాడుతున్న స్త్రీల ఫోటోలు ముద్రిస్తున్నాయి. ఈ కార్యకలాపాలన్నీ చాలా కాలం నుండి ఒక పథకం ప్రకారం షైతాన్ మెప్పును

పొందడానికి నిర్వహించబడుతున్నాయి. ఇలాంటి వాటిని బహిర్గతం చేయనట్లయితే వారి పత్రికలు కనబడకుండా పోయేవి. వాటికి ముందు నవలలు, కథలూ ఉండేవి కావు. వీటి తర్వాత ఈ సినిమాలూ ఉండేవి కావు. మన విద్యా సంస్థల్లో విద్యనార్జిస్తున్న విద్యార్థి, విద్యార్థినుల మధ్య సంబంధాలను మార్గభ్రష్టత్వం వైపునకు తీసుకుపోయే సంస్థలు, సరైన విద్యను బోధించడానికి ఉపక్రమించని వారి చేతుల్లో విద్యార్థులు ఉండకపోయి వుంటే నేడు ఈ దుర్గతి పట్టేది కాదు. ఒక రోజు ముస్లిం మహిళలు అర్ధనగ్నంగా, బాస్కెట్ బాల్ ఆటలు ఆడతారని గాని లేదా వ్యాయామం కార్యక్రమాలలో కనబడతారని లేదా బీచ్‌ల వద్ద వేసవి తాపం తీర్చుకుంటూ కనబడతారని ఎవరూ ఊహించలేదు! ఒకవేళ ఈ రోజు ఈ చెడుగులన్నింటికీ కారకులైన ఖాసిమ్, అమీన్[12] మరియు అతని సహచరులు, వారి గోరీల నుండి బయటకు వచ్చి, ప్రజలకు వారిచ్చిన పిలుపుకు పర్యవసానంగా ఈ రోజు స్త్రీ ఏ స్థాయికి దిగజారిందో చూసి ఉంటే దిమ్మతిరిగి మూర్ఛబోయే వారు.

నిజానికి ఈ విషయం అతి సాధారణమైనదీ, నీచమైనదీను. కాని దీని గురించిన చర్చల వల్ల ఇది అసలు పరిమాణం కంటే మరీ పెద్దదిగా తయారై కూర్చుంది. ఇది స్వతహాగా అంత ప్రభావవంతంగా ఉండదు కాని, దీని గురించి చర్చించినప్పుడు ఇది అధిక ప్రభావాన్ని చూపే సామర్థ్యాన్ని పుంజుకుంటుంది. స్త్రీ సౌందర్యాన్ని, ప్రేమను మనోరంజితంగా వర్ణిస్తూ వ్రాసిన కథలు, సంఘటనలు, చిత్రలేఖనాలు మరియు శృంగార భరిత గానాల వలన ధర్మసమ్మతం కాని లైంగిక కోరికలను ఇప్పుడు నీ మనస్సులో నింపుకుని ఉన్నావో, అందులో పదో వంతులో ఏదో వంతు కూడా నీలోనూ, ఇతర యువకుల్లోనూ గుర్తించే వాడివి కావు. ఒది ఒక సహజమైన వ్యవహారంలా కన్పిస్తున్నా వాస్తవానికి దీని ఉనికి అపరిశుద్ధమై పోయింది. అందువలన

---

12) ఖాసిమ్ అమీన్, అరబ్బుకు చెందిన మోడ్రనిజం (ఆధునికతను) ఇష్టపడే ఒక రచయిత.

అల్లాహ్ వారి కొరకు మద్యాన్ని (సారాని) సృష్టించాడు. దీన్ని సేవించిన తర్వాత ఇది మనిషిని గ్రుడ్డివానిగా, చెవిటి వానిగా, మంచీచెడుల విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయేటట్లుగా చేస్తుంది. మనిషి దీనిని గురించి మనోవాంఛలకు అతీతంగా జ్ఞానాన్ని ఉపయోగించి ఆలోచిస్తే ఇలాంటి దుర్భర పరిస్థితులు మచ్చుకైనా కానరావు.

ఒక విషయం గుర్తుంచుకో, చెడు సాంగత్యం లభించనంత వరకూ ఇలాంటి కోరికలు, ఉపాయాలు వాటి ప్రభావం చూపలేవు. చెడు నడతను కలిగిన వ్యక్తి నిన్ను అశ్లీలత వైపునకు నెడుతూ నెడుతూ, చివరకు దాని గుమ్మం వరకూ నిన్ను చేర్చి తీరుతాడు. దీని ఉదాహరణ ఎలాంటిదంటే, సకల హంగులను కలిగి, సిద్ధంగా ఉన్న ఒక కారు లాంటిది ఈ కోరిక. చెడ్డ మిత్రుడు ఆ కారు బ్యాటరీ వంటివాడు. బ్యాటరీ లేనిదే కారు కదలదు.

సహజంగా ప్రకృతి, శరీరం విషయానికొస్తే అవి దాంపత్య జీవితం కొనసాగించమని సూచిస్తాయి. సామాజిక పరిస్థితులు, విద్యా విధానాలు ఈ మూడింటిలో నుండి ఏదో ఒక దాన్ని ఎంచుకోమని సూచిస్తాయి. కాని వీటిలో ఏ ఒక్కటి కూడా సవ్యమైనది కాదు.

నువ్వు నాల్గవ మార్గం గురించి తప్పకుండా యోచించు, ఇదొక్కటే సరైన మార్గం. అదే వివాహం!

ఇప్పుడు ఈ కోరికలు రోగం వంటివి అని నువ్వు తెలుసుకున్నావు. మరి దానికి మందు ఏమిటి? అని నువ్వు అడగాలనుకుంటున్నావు.

దీనికి చికిత్స ఏమిటంటే, అల్లాహ్ ఆదేశాల వైపునకు మరలి, ఏ వస్తువు దేని కొరకు సృష్టించబడిందో, దాన్ని ఆ పని కొరకే ఉపయోగించాలి. అల్లాహ్ ఏ వస్తువునైనా నిషేధిస్తే దానికి బదులుగా దానికంటే ఉత్తమమైన వస్తువును మన కొరకు ధర్మసమ్మతం చేస్తాడు. ఆయన వడ్డీని నిషేధించి వ్యాపారాన్ని ధర్మసమ్మతం చేశాడు. వ్యభిచారాన్ని నిషేధిస్తే, వివాహాన్ని

ధర్మసమ్మతం చేశాడు. అందువలన ఈ రోగానికి చికిత్స వివాహమే.

వివాహమే సంపూర్ణ ఆరోగ్యానికి ఏకైక మార్గం.

ఇస్లామీయ సంస్థలకు, కమిటీలకు నేనిచ్చే సలహా ఏమిటంటే, ఆధునిక పద్ధతులకనుగుణంగా యువకులు వివాహం చేసుకోవటానికి ప్రోత్సహించి, ఆ దిశలో ఉత్సాహపరిచే సంస్థలను స్థాపించండి. వివాహాన్ని వారి కొరకు సులభతరం చెయ్యండి. వారికి సరితూగే, సలక్షణమైన అమ్మాయిలను గుర్తించి తెలియజేయండి. అబ్బాయిలు కూడా ఆ అమ్మాయిలకు తగిన వారై ఉంలేలా జాగ్రత్తవహించండి. ఏ యువకుడైనా బీదవాడైతే అతనికి ధన సహాయం అందించి ఆర్థికంగా ఆదుకోండి.

ఎవరైతే ఈ విషయంలో ఆసక్తి కలిగి ఉన్నారో, నా సలహాలను పాటించాలనుకుంటున్నారో వారి కొరకు నేను దీనిని ఇంకా విడమరచి చెబుతున్నాను.

నీకు వివాహం చేసుకునే స్తోమత లేనప్పుడు, నిన్ను నీవు అశ్లీలత నుండి రక్షించుకోవాలనుకుంటే, నీలో ఉత్తమ నైతిక విలువలను పెంపొందించుకుని, నీచ కార్యాలపై చూపోవు వహించి, ఉన్నత స్థాయికి ఎదిగిపో, నేను సైకాలజీని ఉపయోగించి ఈ విషయాన్ని ఇంకా కఠినతరమైనదిగా చేయదల్చుకోలేదు. దీన్ని ఒక ఉదాహరణ ద్వారా నీకు వివరిస్తాను. విను!

టీ కాచే గిన్నెపై దృష్టి సారిస్తే దాని క్రింద నుండి మంట మండుతుంటుంది. గిన్నె మూతను గట్టిగా ఆవిరి బయటకు పోకుండా బిగించామనుకోండి, గిన్నె లోపల పీడనం అధికమై అది పేలిపోయి ముక్కలు ముక్కలైపోతుంది. ఒకవేళ గిన్నెకు రంధ్రం చేశామనుకోండి, టీ అంతా కారిపోయి అది మాడిపోతుంది. కాని ఆ ఆవిరిని పైప్‌లైన్ ద్వారా ఫ్యాక్టరీలు, ట్రైన్ ఇంజన్‌లకు అనుసంధానం చేస్తే అది వాటిని నడిపిస్తుంది. ఇంకా ఎన్నో ఆశ్చర్యకరమైన పనులనూ నిర్వర్తిస్తుంది.

ఇక్కడ మొదటి కేసు, లైంగిక కోరికలను అణిచి ఉంచుకునే వ్యక్తికి సంబంధించినది. దీని వలన అతను దిగులుగా, విచారంగా ఉంటాడు.

రెండవ కేసు, సన్మార్గాన్ని విడనాడి దుర్మార్గం వైపునకు వెళ్లిపోయిన వ్యక్తిది. అతను నిషిద్ధ కార్యాలలో చిక్కుకొని వాటి నుండి సుఖాన్ని ఆస్వాదించాలనుకుంటాడు. కానీ చివరకు ఆరోగ్యాన్ని, భవిష్యత్తునూ కోల్పోతాడు.

మూడవ కేసు, ఉత్తమ నైతికతా వైఖరిని అవలంబించే వ్యక్తిది.

ఉత్తమ నైతికత అంటే ఏమిటంటే, మనిషి తనలోని శారీరక, మానసిక కోరికలలలోని చెడు కోరికలను త్యజించి, వాటిని దరిచేరనీయకుండా జాగ్రత్తపడటం, దీని వల్ల నువ్వు అల్లాహ్ సంస్మరణ, ఆరాధనలో నిమగ్నమవుతావు, సత్యాన్వేషణ, పరిశీలనా విభాగాల్లో రాణిస్తావు లేదా నీ దృష్టి కళారంగం వైపునకు మళ్లుతుంది. ఇవేగాక నీలో ఉత్తమ మనోభావాలు ఉప్పొంగి, నువ్వు వాటిని నీ కవితల్లో బంధిస్తావు. వీటిలో ఏవీగాక పోయినా కనీసం నీ దృష్టి శారీరక శ్రమ వైపునకు మళ్లుతుంది.[13] దీని ఫలితంగా నీ మనస్సులో ప్రశాంతత పదిలమైపోతుంది.

కుమారా!

ప్రతీ మనిషికీ అన్నింటికంటే తన ప్రాణం ప్రీతికరమైనదిగా ఉంటుంది. అతను తన క్షేమాన్నే కోరుకుంటాడు. ఈ విషయంలో మాత్రం అతను తనకంటే ఎక్కువగా ఇతరులకు ప్రాధాన్యత నివ్వలేడు. అతను అద్దం ముందు

---

13) వివాహం చేసుకునే స్థోమత లేని వారి కొరకు ప్రియ ప్రవక్త (స) ఒక మంచి ఉపాయాన్ని తెలియజేశారు.

ఇలా సెలవిచ్చారు : **"మీలో ఎవరైతే వివాహం చేసుకునే స్థోమత కలిగి ఉన్నారో వారు వివాహం చేసుకోండి మరియు ఎవరైతే స్థోమత కలిగిలేరో వారు ఉపవాసాలను పాటించండి. ఉపవాసం మీలోని కోరికలను అదుపులో ఉంచి, వాటి దాడి నుండి రక్షక కవచంలా పని చేస్తుంది.**

నిలబడినప్పుడు తన విశాలమైన ఛాతీని, దేహ దారుఢ్యాన్ని చూసుకుని అత్యంత ఆనందభరితుడవుతాడు. ఆ సమయంలో స్త్రీ దేహం కంటే తన దేహమే బలమైనదిగా, లోపరహితమైనదిగా భావిస్తాడు. అతను ఎట్టి పరిస్థితుల లోనూ దీన్ని బలి చేయడానికి ఇష్టపడడు. ఈ కారణంగా ఏ మహిళ మధుర సంభాషణలపై గానీ లేదా ఆమె నీలి కళ్లపై గానీ తన పురుషత్వాన్ని బలిచేసి తాను జుగుప్సాకరంగా, ఎముకల గూడు వలె మారటానికి ఇష్టపడడు.

దీనిని బట్టి తెలిసేదేమిటంటే, వివాహమే ఈ రోగానికి సరైన చికిత్స, ఈ చికిత్స అందుబాటులో లేని పక్షంలో మనిషి తన లైంగిక కోరికలను, మనో వాంఛలను అదుపులో ఉంచుకుని, ఉత్తమ నైతిక విలువలను పెంపొం దించుకోవాలి. దీనివలన సంతృప్తికరమైన జీవనాన్ని ఆస్వాదించ వచ్చు. ఇది అన్ని సందర్భాలలోనూ లాభదాయకమైనదే కాని, నష్టపరిచేది మాత్రం ఎన్నటికీ కాదు.

సామాజిక చెడుగులను ప్రోత్సహించే, సమాజంలో కల్లోలం రేపేవారు పన్నే కుట్రలు ఎలాంటివంటే; స్త్రీ పురుషులను పరస్పరం కలివిడిగా ఉండే అలవాటుకు గురి చేయడం ద్వారా, వారిలో లైంగిక కోరికలను అదుపులో ఉంచుకునే సామర్థ్యం బలహీన పడుతుంది. అప్పుడు వారిని వ్యభిచార గృహాలకు చేరుకునేలాచేసి, తాము లబ్ది పొందవచ్చనే ఉద్దేశ్యంతో ఈ కలివిడిగా ఉండే విధానాన్ని సమర్థిస్తున్నారు. ఇవన్నీ అశ్లీలమైన, లోపభూయిష్టమైన విషయాలు. ముస్లిమేతరులు విశృంఖలంగా, కలివిడిగా జీవించడం వల్ల ఎదురయ్యే పర్యవసానాలను చవిచూస్తూనే ఉన్నారు. దీని వల్ల కేవలం వ్యభిచారం మరియు సామాజిక అశ్లీలతలు పెట్రేగిపోవడం తప్ప మరేమీ వారికి లభించలేదు.[14]

14) స్కాండినేవియన్ దేశాల ఉదాహరణ మన కళ్ల ముందే ఉంది. అక్కడి యువకు లకు లైంగిక వాంఛలను తీర్చుకునే పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వబడింది. ఈ స్వాతంత్ర్యాన్ని వాళ్లు తమ ఇష్టమొచ్చినట్లుగా వాడుకున్నారు. అయినా వారు

వ్యభిచార గృహాలకే ప్రాధాన్యత ఇచ్చి, వాటిని స్థాపించాలనుకుంటే మొత్తం యువకులందరి అవసరాలు, కోరికలు తీరేలా అధిక సంఖ్యలో వాటి అవసరం కలుగుతుంది.

ఈ ఉపాయాన్ని ఒకవేళ సరైనది గానే భావించినా, వీటిని నడపడానికి ఖాహిరా లోనే పదివేలకు పైగా వేశ్యలు కావలసి ఉంటుంది. ఎందుకంటే ఖాహిరాలో ఇరవై ఐదు లక్షల జనాభాలో కనీసం రెండు లక్షల మంది యువకులైనా తప్పక ఉండే ఉంటారు. యువకులందరికీ మనం వ్యభిచారం ధర్మసమ్మతమైనదే అని అనుమతినిస్తున్నట్లుగా సర్టిఫికేట్ ఇచ్చి వేస్తే వారికి వివాహం చేసుకునే అవసరమే ఉండదు. కాని మరి కుమార్తెలను ఏం చేస్తారు? వారి కొరకు వ్యభిచార గృహాలు తెరిచి వారినే వేశ్యావృత్తిలో ప్రవేశింపచేస్తారా?

కుమారా! ఇవన్నీ అనవసర విషయాలు

ఈ మాటలను వారు తమ జ్ఞానానుసారం కాదు, శారీరక, లైంగిక కోరికలకు అనుగుణంగా అంటున్నారు. దీని వల్ల వారు నైతికంగా మెరుగ్గుగా ఉండాలని భావించరు, స్త్రీ జాతి జీవన సార్ధకత, అభివృద్ధులనూ వారు కోరుకోరు. దీని ద్వారా వారు సుహృద్భావ సంస్కృతి గురించే బోధించడం లేదు, వారి ఉద్దేశ్యం ఆత్మ పరిశుద్ధతా కాదు. ఇది నిజానికి ఒక ఆట. కొన్ని పదాల గారడి. వారు ప్రతి రోజు ఒక కొత్త పోకడకు రూపమిచ్చి ప్రజలు దానికి వత్తాసుపలికేలా చేస్తుంటారు.

వీటన్నింటి వెనుక దాగి ఉన్న ఏకైక లక్ష్యం ఏమిటంటే, మన కుమార్తె లను, సోదరీమణులను సురక్షితమైన నాలుగ్గోడల నుండి బయటకు

---

సాఫల్యం పొందారా? అనేది ఇక్కడ ఉత్పన్నమయ్యే ప్రశ్న. ముమ్మాటికీ లేదు. ఆ దేశాలలో ఎంతమంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారో, ఎంతమంది మానసిక ఒత్తిళ్లకు గురై ఉన్నారో, ఎంత మంది మద్యంలోనూ మరియు డ్రగ్స్‌ల లోనూ జోగుతున్నారో మీరు చూడట్లేదా? వీటిలో ప్రతీదీ వారి జీవితాన్ని అంతం చేయడానికి పూనుకుని ఉందని రుజువవుతూనే ఉంది.

రప్పించటం. అలా వారిలో దాగి ఉన్న, బయటకు కనబడుతున్న అందచందాలతో వారు ఆనందం పొందాలని. అది ధర్మసమ్మతంగానైనా సరే లేదా నిషిద్ధ కార్యాల ద్వారా అయినా సరే ప్రతీ విధానంలోనూ వారి నుండి తమ కాంక్షలను చల్లార్చుకోవడమే ప్రయాణానికి ఒంటరిగా బయలు దేరినప్పుడు వారితో పాటు ప్రయాణించడానికి, సింగారించుకుని ఫంక్షన్‌లకు వెళ్తే వారితో డ్యాన్సులు వేయించడానికి వారు ఇలా చేస్తున్నారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, చాలా మంది తల్లిదండ్రులు ఈ వ్యవహారంలో మోసానికి లోనయి ఉన్నారు. నాగరికంగా అభివృద్ధి చెందిన వారిగా గుర్తింపు పొందడానికి తమ కుమార్తెల శీలాన్ని బలిచేస్తున్నారు.

కుమారా! ఒకవేళ ఈ సమాధానంతో నువ్వు సంతృప్తి చెందకపోయి నట్లయితే మొహమాటం లేకుండా నాకు మరలా ఉత్తరం వ్రాయి. ప్రకృతి నీలో ఎలాంటి లైంగిక కోరికలను రేపుతుందో వాటిపై నీకు ఆసక్తి కలగటాన్ని తెల్పడం ఏవిధంగానూ సిగ్గుపడవలసిన విషయం కాదు. ఇది బలం, ధైర్యం మరియు యవ్వనానికి నిదర్శనం. నువ్వు విద్యార్థివి అనే విషయాన్ని పక్కనబెట్టి వివాహం చేసుకో. ఒకవేళ వివాహం చేసుకునే అనుకూలత నీకు లేకపోయినట్లయితే, దైవభీతితో, దైవారాధనలో నీ మనస్సును లగ్నం చెయ్యి. ఇంకా కళారంగంపై ఆసక్తిని పెంచుకో. ఇంకా వ్యాయామం కూడా తప్పనిసరిగా చేస్తూ ఉండు. ఇదే గొప్ప చికిత్స.

ఇంకా వ్రాస్తే విషయం పెద్దదైపోతుంది. సందర్భానికనుగుణంగా ఎంత వ్రాయగలనో అంత వ్రాశాను. ఇంకా ఎవరైనా, ఏ విషయమైనా తెలుసుకోవాలనుకుంటే ఇన్షాఅల్లాహ్, ఇంకొక చిరుపుస్తకం వ్రాస్తాను. పాఠకులు కోరితే మరో వ్యాసం వ్రాస్తాను.

# పదకోశం

### 1) అబూ నవాస్

అబ్బాసీ కాలానికి చెందిన ఒక ప్రముఖ కవి. ఇతను తన కవితల్లో ఇస్లామీయ విధి విధానాలను పరిహసించాడు. ధర్మాన్ని కించపరిచే కవితలు అల్లడం వల్ల అతన్ని ఖైదీగా జైల్లో బంధించారు. ఇతని మరణం జైలులోనే జరిగింది.

### 2) సికందరియా

పదహారు వేరు వేరు ప్రదేశాలను కలిపి సికందరె ఆజమ్ పేరు మీదుగా సికందరియా అని పేరు పెట్టబడింది. ఇక్కడ ఈజిప్టుకు చెందిన ప్రాచీన నగరం మరియు ఓడరేవు అయిన సికందరియా గురించి ప్రస్తావించబడింది. ఈ నగరాన్ని అత్యంత అందంగాను మరియు నగిషీలతోనూ అలంకరించబడింది. దీనిని ఆంగ్లంలో అలెగ్జాండ్రియా అని అంటారు.

### 3) స్కాండినేవియన్ దేశాలు

సోవియట్ మరియు రష్యాలకు పశ్చిమ సరిహద్దు వద్ద ఒక దానితో ఒకటి కలిసి ఉండే మూడు దేశాలైన ఫిన్‌లాండ్, స్వీడన్ మరియు నార్వే దేశాలు "స్కాండినేవియన్ దేశాలు" పేరుతో ప్రసిద్ధిగాంచాయి. ఈ మూడు దేశాలను కలిపి చూస్తే ద్వీపకల్పం వలె కనబడతాయి.

**4) ఇస్మాయీలియా**

ఇది ఈజిప్టుకు చెందిన ఒక ప్రాచీన నగరం. ఇది సూయజ్ కాలువ తీరాన ఉంది. క్రీ.శ. 1863లో సూయజ్ కాలువ తవ్వకాలు జరిగినప్పుడు ఈ నగరం స్థాపించబడింది. దీని పేరు ఈజిప్టు చక్రవర్తి ఇస్మాయీల్ పేరు మీదుగా ఇస్మాయీలియా అని పెట్టబడింది.

**5) జామియా అజ్‌హర్**

ఈ మహోన్నతమైన మస్జిద్ ఖాహిరాకు చెందిన గొప్ప మస్జిద్‌లలో ఒకటి.

**6) జామియా అమ్‌వా**

దీన్ని జామియా దమష్క్ (డెమాస్కస్) అని కూడా అంటారు. ఇది ఒక్క డెమాస్కస్‌లోనే కాదు, మొదటి హిజ్రీ శతాబ్దంలో ప్రపంచంలోనే అత్యంత సుందరమైన ప్రఖ్యాత మస్జిద్. దీన్ని అత్యంత సుందరంగా నిర్మించారు.

**7) షాహ్ ఫారూఖ్**

ఈజిప్టుకు చెందిన ముహమ్మద్ అలీ కుటుంబానికి చెందిన చివరి చక్రవర్తి. 1936లో తన తండ్రి అహ్మద్ ఫవాద్ మరణానంతరం సింహాసనాన్ని అధిష్టించాడు.

**8) తన్‌తావి**

పుస్తక రచయిత గారి పేరు అలీ. ఈయన ఈజిప్టుకు చెందిన ప్రసిద్ధ నగరమైన తన్‌తా ప్రాంతానికి చెందిన వారు అవడం వల్ల తన్‌తావి ఈయన పేరులో చేరింది.

## 9) ఖాసిమ్ అమీన్

ఖాసిమ్ ఇబ్నె ముహమ్మద్ బక్ అమీన్ మిస్రీ ఒక ప్రసిద్ధ అరబీ పండితులు, రచయిత మరియు పరిశోధకుడు.

## 10) కిస్రా

సాసానీ వంశానికి చెందిన ఇద్దరు ఇరానీ పాదుషాల అరబీ పేరు.

## 11) మజూసి

మీడియాకు చెందిన ఒక జాతి. వీళ్లు అగ్ని పూజారులు. వీళ్లు జర్‌దష్త్ వారికంటే ముందుగా అక్కడ నివసించేవారు.

## 12) ఎయిడ్స్

ఎయిడ్స్ అనేది అత్యంత ప్రమాదకరమైన మరియు చికిత్స లేని వ్యాధి. ప్రపంచమంతట సైంటిస్టులు మరియు డాక్టర్లు కలిసి అన్ని రకాల పరిశోధనలు చేసినప్పటికీ దీనికి వైద్యాన్ని కనిపెట్టలేకపోయారు. ఈ వ్యాధి అమెరికా నుండి వచ్చింది. (దీని పుట్టుక విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు యూరప్ మరియు అమెరికా శాస్త్రవేత్తలు ఆఫ్రికా నుండి ఈ వ్యాధి వచ్చిందని భావిస్తున్నారు. కాని వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ (**W.H.O**) వెలువరించిన తాజా రిపోర్టు ఈ భావనను తప్పుడు భావనగా తేల్చేసింది). అమెరికా, ఇతర పాశ్చాత్య దేశాలలో ఈ వ్యాధి అంటువ్యాధి వలె వ్యాప్తి చెందుతుంది. ఇతర దేశాలకు కూడా ఇది ప్రాకింది. అందువలన ప్రజలు దీనిని గురించి భయభ్రాంతులకు గురై ఉన్నారు. సాధారణ ప్రజల దగ్గరి నుండి ప్రభుత్వం వరకు దీని లక్షణాలు ఏమిటో, ఇది ఎలా వ్యాప్తి చెందుతుందో తెలుసుకోవడానికి ప్రయత్నాలు జరుపుతున్నారు. ఈ వ్యాధి శాస్త్రవేత్తలకు, డాక్టర్లకు కంటిమీద కునుకు లేకుండా చేసేసింది.

ఈ మహమ్మారి విచ్చలవిడిగా లైంగిక కార్యకలాపాలకు పాల్పడటం వల్ల కలుగుతుంది. ఈ వ్యాధికి గురైన మొట్టమొదటి వ్యక్తి "రాక్ హెడ్సన్" ఇతను అమెరికాకు చెందిన హాలివుడ్ హీరో. ఇతను ప్రకృతికి విరుద్ధంగా స్వలింగ సంపర్కానికి అలవాటుపడ్డాడు. ఈ దురలవాటే అతనికి ఎయిడ్స్ వ్యాధిని కలగజేసింది. ఇదే అతనికి మృత్యువుగా పరిణమించింది. ఇది అక్టోబర్ 1985నాటి మాట. వారి వద్ద స్వేచ్ఛాసెక్స్‌గా పరిగణించబడిన స్వలింగ సంపర్కం దేనికైతే అనుమతిస్తూ చాలా పాశ్చాత్యదేశాలు చట్టాలు, శాసనాలు రూపొందించుకున్నాయో, అది కేవలం నైతిక విలువలను దిగజార్చేదే కాదు, సామాజిక పరంగా ఒక చెడుగును బలపరచడం, ఆరోగ్యపరంగా చికిత్స లేని వ్యాధిని ఆహ్వానించడమూ అని అతని మరణం తర్వాత ప్రపంచానికి తెలిసివచ్చింది. దీనికంటే ముందు లాస్ ఏంజిల్స్ (అమెరికా)కు చెందిన ఒక హాస్పిటల్‌లో 1981 సంవత్సర ఆరంభంలో ముగ్గురు రోగులు ఈ వ్యాధి వల్ల ప్రాణాలు వదిలారు, వీరందరూ స్వలింగ సంపర్కానికి అలవాటుపడ్డ వారని తర్వాత తెలిసింది.

**ఈ వ్యాధి లక్షణాలు** : ఆకలి మందగించటం, మాటి మాటికీ జ్వరం రావడం, దగ్గు, విరోచనాలు, శరీరంపై నల్లని మచ్చలు రావడం, నాలుకపై తెల్లని పొక్కులు రావడం, బరువు తగ్గిపోవడం, రహస్యాంగాలపై తెల్లని మచ్చలు రావడం, శరీరం నుండి అత్యంత దుర్గంధం వెలువడటం. ఇంకా దీని వల్ల మొదడు మరియు ఊపిరిత్తులు కూడా ప్రభావితమవుతాయి.

చివరకు అత్యంత దుర్భరమైన స్థితిలో, బాధాకరమైన మృత్యువును చవిచూడాల్సి ఉంటుంది. చనిపోయిన తర్వాత మృతదేహం నుండి భరించరాని దుర్గంధం వెలువడుతుంది. ఈ వ్యాధిని నయం చేయడానికి అమెరికా మరియు జపాన్లలో అనేక ఔషధాలను తయారు చేశారు కానీ అన్నీ పనికి రాకుండా పోయాయి!

భారతదేశంలో ఈ వ్యాధి 1986లో తమిళనాడు రాష్ట్రంలో గుర్తించబడింది. ఇక్కడ వ్యభిచారులలో ఎయిడ్స్ వైరస్‌లు గుర్తించబడ్డాయి. ఇదే సంవత్సరంలో జూన్ నెలలో ముంబయికి చెందిన ఒక హాస్పిటల్‌లో ఈ వ్యాధితో ఒక వ్యక్తి మరణించాడు. అతనికి 1981లో అమెరికాలో బైపాస్ సర్జరీ చేయబడింది. ఆపరేషన్ సమయంలో అతనికి రక్తం ఎక్కించబడింది. ముంబయిలో అతనికి వైద్యం చేసిన డాక్టర్ల నిర్లక్ష్యం వల్ల రక్తం ద్వారా వైరస్ అతని శరీరంలోనికి ప్రవేశించింది. ఇదే సంవత్సరం నవంబర్ నెలలో ఒక భారతీయ వ్యాపారి అహ్మదాబాద్‌లోని సివిల్ ఆసుపత్రిలో ఈ వ్యాధితోనే మరణించాడు. వేశ్యలలో కనబడే ఎయిడ్స్ వైరస్ అన్నిచోట్లా, అందరి వద్దా లైంగిక కోరికలను తీర్చుకునే బాటసారుల నుండి కానుకగా సోకుతుందని భావించబడుతోంది.

ఈ వాక్యాలు వ్రాసేటప్పటికీ తాజా అధ్యయనాల పరంగా భారత దేశంలో ప్రస్తుతం 29మందికి ఎయిడ్స్ వ్యాధి సోకింది. వారిలో 18మంది భారతీయులు కాగా మిగిలిన 11మంది విదేశీయులు, గత సంవత్సరం ఇండియన్ కౌన్సిల్ ఫర్ మెడికల్ రీసెర్చ్ ( )సంస్థ వారు రెండు లక్షల వ్యక్తులను పరీక్షించగా వారిలో 864 మందిలో ఎయిడ్స్ వైరస్‌ను గుర్తించారు. వారిలో 310మంది వేశ్యలు, 168 మంది రక్తదానం చేసే వృత్తి గలవారు, 9 మంది గర్భవతులున్నారు. ఈ అధ్యయనం ద్వారా భారత దేశంలో ఈ వ్యాధి సోకడానికి గల ప్రధాన కారకాలు వ్యభిచారుణులు మరియు రక్త దానం చేసేవారు అని తేల్చుటం జరిగింది.

## ఈ వ్యాధి ఏ విధంగా సోకుతుందో పరిశీలిద్దాం

1) విశృంఖల లైంగిక సంబంధాలకు దూరంగా ఉండాలి. అంటే స్వలింగ సంపర్కమైనా లేదా వ్యభిచారం అయినా సరే, భారతీయ చట్టం

ప్రకారం స్వలింగ సంపర్కానికి పాల్పడిన వారికి పది సంవత్సరాలు జైలు శిక్ష విధించాలి. ఇస్లామీయ చట్టం ప్రకారం ఆ ఇద్దరినీ సజీవదహనం చేయాలి లేదా వారిని వధించాలి. వేశ్యల వద్దకు, కాల్ గర్ల్స్ వద్దకు పోయిన వారికీ ఎయిడ్స్ సోకుతుంది. ఒకవేళ ఎయిడ్స్ సోకక పోయినా గుప్తరోగాలు తప్పకుండా సోకుతాయి. ఇవి మనిషి మనశ్శాంతిని హరించి, ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి.

2) మత్తు మందులకు బానిసలైన వారికి కూడా ఎయిడ్స్ సోకే అవకాశం ఉంది. అవి స్మైక్, కోకన్, హెరాయిన్ లేదా హషీష్ రూపాల్లో ఉన్నా లేదా వేరే రూపాల్లో ఉన్నా వీటిని సామూహికంగా గ్రహించడం ద్వారా కూడా ఎయిడ్స్ సోకుతుంది.

3) ఎయిడ్స్ ఉన్న వారికి చేసిన ఇంజక్షన్‌లను ఆరోగ్యవంతులకు ఉపయోగించడం వల్ల కూడా ఈ వ్యాధి సోకుతుంది. రక్తదానం చేసే వృత్తి గలవారి రక్తం నుండి కూడా ఈ వ్యాధి సోకవచ్చు. ప్రమాదాలు లేదా ఆపరేషన్ సమయంలో రక్తం ఎక్కించే అవసరం ఏర్పడినప్పుడు తమ దగ్గరి బంధువులు ఎవరైతే ఆరోగ్యం గానూ, నైతికంగా, ఉత్తమంగా ఉన్నారో వారి నుండే రక్తాన్ని తీసుకోవడం శ్రేష్టమైనది.

సంక్షిప్తంగా చెప్పదలచుకున్నదేమిటంటే, పరిశుద్ధమైన జీవితం గడిపే వారికి ఇహలోకంలోనూ, పరలోకంలోనూ కారుణ్యం ఉంటుంది. దీనికి విరుద్ధంగా మనుగడ సాగించేవారికి రెండు లోకాల్లోనూ బాధాకరమైన పర్యవసానం తప్పదు.

**W.H.O** వారి తాజా నివేదిక ప్రకారం, ఇప్పుడు ప్రపంచంలోని 141దేశాల్లో ఎయిడ్స్ రోగులు 1,41,894 మంది ఉన్నారు. కాని నిజానికి

వీరి సంఖ్య రెట్టింపుగా ఉండవచ్చు. **W.H.O** వారి అపీల్ మేరకు ప్రపంచ 178 దేశాలలో ఎయిడ్స్ ఎంత మందికి సోకిందో దర్యాప్తు జరుపగా వారిలో కేవలం 32 దేశాలు మాత్రమే వారి దేశాల్లో ఎయిడ్స్ వ్యాధికి గురైన ఒక్క కేసు కూడా వెలుగులోనికి రాలేదని తెల్పాయి. ఈ రిపోర్టు ప్రకారం, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులు అత్యధికంగా 21, 322మంది అమెరికాలో ఉన్నారు, రెండవ స్థానంలో యూరప్ 1,996 మంది రోగులను కలిగి ఉంది. ఆసియాలో 338 మంది వ్యాధిగ్రస్తులున్నారు. (జన్‌సత్తా దినపత్రిక 5/3/1989)

ఎక్వయిర్డ్ ఇమ్యునో డిఫిషన్సీ సిండ్రోమ్ సంక్షిప్త రూపమే (**AIDS**) ఎయిడ్స్. ఈ వైరస్ మానవుల వ్యాధి నిరోధక శక్తిని తగ్గించి వేస్తుంది. ఈ వ్యాధి సోకిన తర్వాత ఏదైనా అనారోగ్యం కలిగితే అది జీవితాంతం తగ్గదు. ఈ వైరస్ చిన్న పరిమాణంను కలిగి ఒక సూది చివరలో పదిహేను వేలు పట్టేస్తాయి.

ఆటమ్ బాంబులు మరియు హైడ్రోజన్ బాంబులతో ప్రపంచాన్ని సర్వనాశనం చేయగల శక్తి కలిగిన మానవుడు నేడు ఈ వైరస్‌ను అంత మొందించడంలో నిస్సహాయుడై ఉన్నాడు. ఇప్పుడు పత్రికల్లో ఎయిడ్స్ సోక కుండా తీసుకోవలసిన జాగ్రత్తలను ప్రకటనల రూపంలో తెలుపబడుతున్నాయి. వాటిలో ఇలా వ్రాసి ఉంటుంది. "ఎయిడ్స్ గురించి భయపడండి, మీ జీవిత భాగాస్వామితో తప్ప ఇతరులతో లైంగిక సంబంధాలు కొనసాగించటం ప్రాణాంతకమవుతాయి. జాగృతులవ్వండి."

ప్రస్తుతం పొంచి ఉన్న ప్రమాదాన్ని గుర్తించి ప్రభుత్వం విధిగా ఈ వ్యాధి లక్షణాలను, ఏ ఏ కారకాల వల్ల వ్యాపి చెందుతుందో, తీసుకోవలసిన జాగ్రత్తలేమిటో విస్తృతంగా ప్రచారం చేయాల్సి ఉంది. దీనిని నివారించడానికి

చర్యలూ తీసుకోవలసి ఉంది. కాని చాలా కాలం నుండి కొనసాగుతున్న పాపకార్యాలు, ముఖ్యంగా పట్టణాల్లో విస్తరించి ఉన్న లైసెన్స్ కలిగిన వ్యభిచార గృహాలు, పెద్ద పెద్ద హోటళ్లలో, రెస్టారెంట్‌లలో నుండి కాల్ గర్ల్సలను నిర్మూలించడం సాధ్యమయ్యే విషయమేనా? మన ప్రభుత్వం అంతరిస్క్ తీసుకుంటుందా? ఇది ప్రభుత్వ విశ్వాసం మరియు నిజాయితీలకు చెందిన వ్యవహారం. రెండు సంవత్సరాలకు పూర్వం కేంద్ర ప్రభుత్వం చట్టాన్ని రూపొందించటానికి ప్రభుత్వ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ తరపు నుండి లోక్ సభలో బిల్లు ప్రవేశపెట్టినప్పుడు నగర ప్రజల స్వంత విషయాలు మరియు రహస్య కార్యకలాపాలు ప్రభావితమయ్యే ప్రమాదం ఉందని దాన్ని రద్దు పరచటం జరిగింది. అస్తగ్‌ఫిరుల్లాహ్!

# ఇస్లామిక్ పోస్టల్ లైబ్రరీ

## ఇస్లాం ధర్మ బోధనలను తెలుసుకొనే అద్భుత అవకాశం

### తెలుగు మరియు ఇంగ్లీషు భాషల్లో

- ఇస్లాం కోరేదేమిటి?
- మరణానంతర జీవితం గురించిన వాస్తవాలు
- మహిళల ప్రాథమిక హక్కులు
- దివ్యఖుర్ఆన్ బోధనలు
- దేవుని ఉనికికి ఆధారాలు
- తలాఖ్, ఖులా, ముస్లిం పర్సనల్ లా మొదలైన వాటి వాస్తవ సమాచారం

▶ ఇలాంటి ఇంకా అనేక అంశాలు, సమస్యలు, సందేహాలకు ఇస్లామీయ సమాధానాలు తెలుసుకోవడానికి - సంప్రదించండి.
కేవలం ఒక్క పోస్టుకార్డు వ్రాసి ఇస్లామీయ సమాచారం ఉన్న అనేక పుస్తకాలను పోస్టుద్వారా ఉచితంగా చదవండి.

▶ మీరు ఏ మతాన్ని అవలంబిస్తున్నవారైనా, మీరెలాంటి ధార్మిక విశ్వాసాన్ని కలిగివున్నా, ఏ ప్రాంతానికి చెందినవారైనా - ఈ ఉచిత సౌకర్యంతో ప్రయోజనం పొందండి.

నేడే వ్రాయండి:


**ఇస్లామిక్ ఇన్ఫర్మేషన్ సెంటర్**

సందేశభవనం, లక్కడ్‌కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002.